# వీరగాథలు

(పురాణ - నవీన వీరుల కథలు)

గ్రంథకర్త:

ఆకుండి వెంకటశాస్త్రి

ప్రకాశన కర్తలు:

రాయలు అండు కో,

పబ్లిషర్స్ బుక్‌సెల్లర్స్,

కడప.

# వీరగాథలు

(పురాణ - నవీన వీరుల కథలు)


గ్రంథకర్త:

ఆకుండి వెంకటశాస్త్రి

శ్రీమహంతు దేవస్థానము హిందూ హైస్కూలు, వేలూరు

ఉత్తర ఆర్కాడు జిల్లా








ప్రకటన కర్తలు:

# రాయలు అండు కో;

పబ్లిషర్స్ & బుక్‌సెల్లర్స్,

కడప.

రిజిస్టర్డు కాపీరైటు] 1949 [వెల 0-8-0

# ఉపోద్ఘాతము

బాల బాలికలు వీరుల కథలను వినుటకును, జదువుటకును మిగుల గుతూహలముం జూపుదురు. అందు భారత వీరగాథలు గ్రీకు, పరిష్యన్ వీరగాథలకుం దీసిపోవు. భారత వీరులలో దైవ, మానుష, రాక్షస ప్రకృతులు సమ్మిశ్రితములై చూపట్టును.

కౌరవులయు, పాండవులయు బాల్యక్రీడలను, హనుమంతుని సాహసకార్యములను, రామునియందుగల భక్తిని గూర్చి కథలు చెప్పునప్పుడు బాలికలు, బాలురు వెల్లడించు నానందము నేనెఱుంగుదును

ఇందలి ఘటోత్కచభీమసేనుల గాథ భాసరచిత మగు మధ్యమ వ్యాయోగ నాటకమునందలి కథాకల్పనము వినోదముగ నున్నందున దానిని గైకొని వ్రాసితిని, ఇందు తండ్రికొమరు లొండొరుల నెఱుంగకయే ద్వంద్వయుద్ధ మొనర్చిరి.

భారతారణ్య పర్వమునందలి సౌగంధికప్రసూనాపహరణమను కథయే యిందలి భీమసేన, హనుమంతుల కథ, అభిమన్యుడు భారత యుద్ధమునం బేరొందిన బాలవీరుడు. ఈ వీరుడు తనవిధిని నెరవేర్చెను. కాని యతడు తనతలకు మించిన పనికిఁబూని వీరమరణము నొందెను.

పరశురాముని కథావిషయములు బొంబాయి యూనివర్సిటీపత్రిక లోని శ్రీమతి ఐరావతీ కార్వేగారి వ్యాసమునుండి గ్రహించితిని.

స్వతంత్ర భారతావనియందు తన విద్యచేతను, కవనధోరణి చేతను, వక్తృత్వ విశారదత్వముచేతను, దేశభక్తిచేతను భారతనారీ లోకమున, రాజకీయ రంగమున నాయకమణియై వన్నెయు వాసియు గాంచి కడకు రాష్ట్రపరిపాలనాధికారము వహించిన కీ. శే. సరోజినీదేవి

జీవితమును, అభ్యుదయ భారతదేశమున స్వాతంత్ర్య వాతావరణమున భారత జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వమునకు ప్రధాని పదవి నధిష్ఠించిన జవహర్‌లాల్ నెహ్రూ జీవిత కథనమును చేర్చితిని. పురాణ కథల కీ నవ్య వీరనాయక రత్నముల జీవితకథలను చేర్చి నవ్యతను కల్గించితిని. సహృదయ పాఠక లోకమునకు, బాలలోకమునకు నీకథలు ముదము గూర్చునని యాశించుచున్నాను.

గ్రంథకర్త.

# విషయసూచిక

# వీరగాథలు

---

## 1. ఘటోత్కచ, భీమసేనులు

వ్యాసమహర్షి కృతమహాభారతము వృక్షరాజమగు వటవృక్షమువలె నతివిస్తృతమైనది. ఇందుఁ బెక్కు నీతి బోధకములగు నుపాఖ్యానములు శాఖోపశాఖలుగ విస్తరిల్లినవి. ఈ యుపాఖ్యానములు మూల కథకు రత్నభూషణ సంచయమువలె విరాజిల్లుచు నెంతయు నవ్య శోభను బెంచుచున్నవి. భారతము తఱుగని గాథలకు ఖని. ఆ గ్రంథము రాజనీతికిని, ప్రజాసామాన్యమునకు వలసిన నీతికిని తావలమైన కథావితానము కలది. భారతగాథను గైకొని యద్భుతముగను, రసవత్తరముగను, నాటకాను గుణముగను మార్పులొనర్చి సంస్కృత భాషలో భాస మహాకవి నాటకములను రచించెను. అట్టి నాటకములలో మధ్యమవ్యాయోగ మను నాటక మొకటి. ఆ నాటకకథ యిట వినవింపఁబడుచున్నది.

పాండురాజు మరణానంతరమున, కుంతి తన కొమరులతో ధృతరాష్ట్రుని రాజధానికి వెడలి, యచట పదుమూఁడు వత్సరములు వసించెను. అప్పటికి ధర్మరాజు పదునాఱు వత్సరముల వయస్సువాఁడు. భీముఁడు పదునైదు వత్సరములవాఁడు. అర్జునుఁడు పదునాలుగు వత్సరములవాఁడు. నకుల సహదేవులు పదుమూఁడు వత్సరములవారు. ధృతరాష్ట్రుఁడు కౌరవులకును, పాండవుల

కును విలువిద్య గఱపుటకై ద్రోణాచార్యులను గురువుగా నియమించెను. పాండవులలో భీముఁడు గదను, అర్జునుఁడు వింటిని కౌశలముతో నుపయోగింపఁగలవారైరి. ఆటలలోఁగూడ పాండవులు కౌరవులకంటె మిన్నలని వెల్లడింపఁగల్గిరి. పాండవుల ప్రతిభ కౌరవుల కసూయాజనకమయ్యెను. పాండవులలోఁగల యైక్యభావము, జ్యేష్ఠుని యెడల నితర సోదరులు కనఁబఱచు భ్రాతృభక్తియుం జూచి కౌరవులు భీతిల్లి వారి నెట్లయిన హస్తినాపురినుండి వెడలనడువ సంకల్పించిరి. దుర్యోధనుఁడు తన మేనమామ యగు శకునితో నాలోచనచేసి, పాండవులను వారణావతమున వారికొఱకై ప్రత్యేకముగ నిర్మింపఁబడిన మందిరమున నివసింప నేగుఁడని ప్రోత్సహించెను. ధృతరాష్ట్రునిచేఁ గూడ వారికిఁజెప్పించి వా రొడబడి యచటికి వెళ్లునట్లు చేసెను.

అచట పాండవులకొఱ కేర్పఱుపఁబడిన మందిరము లక్కతో కట్టఁబడెను. దుర్యోధనుని పనుపున పురోచనుఁడను వాఁ డా లక్కయిల్లు నిర్మించెను. పాండవులు కొంతకాల మాగృహమున నివసించుచుండ, నాయింటిని దగులఁబెట్టించి పాండవు లందు మృతులగునట్లు చేయుటయే దుర్యోధనుని దురాలోచనము. అమాయికులగువారల కేదేని యొక విధమున నాపద సంప్రాప్తించినపుడు దైవము వారికి తోడ్పడుచునే యుండును. ఈ సత్యము పాండవుల యెడ సార్థకమయ్యెను. విదురుఁడు పాండవుల క్షేమ మభిలషించెడివాఁడు. కానఁ బాండవులతో, దుర్యోధనుఁ డెట్టి దుష్ట

సంకల్పముచేసి వారిని వారణావతమున మోసపు గృహమున (లక్కయింట) నివసింప నేర్పఱచెనో తెలిపి, జాగరూకులుగ నుండ హెచ్చరించెను.

భీముఁడు తాము నివసించు గృహ మెట్లున్నదో, తా మె ట్లేమఱక యుండవలయునో యెఱిఁగియుండెను. పాండవులలో భీముఁడు ముఖ్యముగ దూరదృష్టిగలవాఁడుగావున రహస్యముగ నొక పనివానిచే నాగృహాంతర్భాగమునుండి యడవిలోనికిఁబోవుట కనువుగ నొకసొరంగమునుద్రవ్వించెను. పాండవు లా లక్కయింట వసించు దినములలో నొక కిరాత స్త్రీ తన యైదుగురు పుత్రులతో నెచటనుండియో నడచి వచ్చి వారణావతమును జేరెను. రాత్రియగుటచే వారెల్లరు నాలక్కయింటి యరుగులపైఁ బరుండి సుఖనిద్రఁజెందిరి. భీముఁడు తామున్న లక్క యింటి కానాఁటిరాత్రి యగ్నిదరి కొల్పఁబడునని యెఱింగినవాఁడగుటచే గాఢనిద్రావివశులైన తన తల్లిని, సోదరులను తన భుజములపైనను, బాహువులలోనను భరించుచు నా సొరంగమునుండి నడచి యొకయడవిం బ్రవేశించెను. భీముఁడు సొరంగమునఁ బోవుటకు ముందుగనే, లక్కయింటికిఁ దానే నిప్పంటించెను. లక్కయిల్లు దగ్ధమయ్యెను. మఱునాఁటి యుదయమున పురజను లా దగ్ధగృహమును వేడ్కతోఁ జూడనేగిరి. అచట కిరాత మాతాపుత్రుల శవములఁ గాంచిరి. పాండవులును, గుంతియు నా దగ్ధగృహమున మడిసిరని జనులెల్లరు తలఁచిరి. ఈ వార్త సుయోధనునికి తెలిసి యతఁడు ముద మందెను.

లాక్షా గృహమునుండి తప్పించుకొని యడవిలోఁ బ్రవేశించు నాఁటికి భీమునకు నిరువదెనిమిది వత్సరముల వయస్సు. అప్పటికి భీమునకుఁగాని, తక్కుంగల నల్వురకుఁగాని వివాహము లై యుండలేదు.

వారు ప్రవేశించిన యడవిలో మనుజఖాది యగు హిడింబుఁ డను పేరుగల రాక్షసుఁడు వసించుచుండెను. ఆ రాక్షసుఁడు కడు భీకరమగు నాకారము గలవాఁడు. ఎఱ్ఱని కండ్లు, దీర్ఘములగు దంష్ట్రిలు గలవాఁడు. శరీరచ్ఛాయ నీలాంబుదమును బోలియుండెను. హిడింబుఁడు తన యడవిలో నూతనముగ మనుజు లెవ్వరో ప్రవేశించిరని పసిపట్టి తన సోదరి హిడింబను, వారెవ్వరో, ఎందులకై యీ యడవికి వచ్చిరో తెలిసికొనిరమ్మని పంపెను. హిడింబ సోదరుని యాజ్ఞఁ దలదాల్చి తిరిగితిరిగి యొక వటవృక్షమును సమీపించెను.

అచ్చట భీమసేనుని గాంచి, యాతని దేహ సౌష్ఠవమును, తేజస్సును తదేకదృష్టితో చూచుచునే నిలచి తన యన్న తన్నెందులకుఁ బంపెనో యీ సందర్భమును మఱచిపోయెను. ఎంతసేపటికిని తన సోదరి రాకుండుటనుగని హిడింబుఁడు తానే యామె యున్న యెడకు వెళ్ళెను. యౌవనవిరాజితయగు తన సోదరి భీమసేనుని వలపుచూపులఁ జూచుచు తదేకదృష్టితో నిలచియుండుటను, ఆమెచాపల్యమును గాంచి క్రుద్ధుఁడై చరచర నడచి యామెను సమీపించెను. భీముఁడదిగాంచి యామెపక్షమును బూని యామెపై సోదరుఁడు చూపుచున్న కోపమును వారింప నా భీకరరాక్షసునిపై

ద్వంద్వ యుద్ధమునకుఁ దలఁపడెను. ఒకరితో నొకరు ఘోరముగ కొంతసేపు పెనఁగిరి. అంత భీముఁడు హిడింబుని నడుము నదిమిపట్టి పైకెత్తి యాతని యెముకలు విఱుగునట్టుల నేలపైఁ గొట్టెను. ఆదెబ్బతో హిడింబుఁడు మృతినొందెను. సోదరుఁడు చనిపోయినందున నగతికురాలైన హిడింబ తన సోదరునిఁ జంపిన వీరుఁడగు భీముని తన్ను పరిణయము గమ్మనికోరెను. రాక్షస స్త్రీ యగుటచే భీకరస్వరూపిణియయ్యు కామరూపిణి కావున సుగంధపుష్పములచే విరాజితమగు కేశపాశము కలదియు, మనోహరకోమలగాత్రియు నై మనుజ స్త్రీవలెనే వచ్చి భీముని ఎదుటనిలిచి తనవైపున కాకర్షించు కొనెను. ఆమె భీమునితో వివాహ విషయమున నొక్క నియమము గావించుకొనెను.

భీమునివలన నొక్క కొమరుని బడయువఱకు మాత్ర మాతనితో నుండుటకును, తదనంతరము భీముఁడు తన్ను గోరినప్పుడు వచ్చుటకును సమ్మతించుట యా నియమము.

తన తల్లియనుమతిని, జ్యేష్ఠుఁడగు యుధిష్ఠిరుని యనుమతినిఁ బడసి హిడింబను భీముఁడు వివాహమాడెను. ఆ వనముననే హిడింబతో నారుమాసములు వసించెను. హిడింబ రూపబలముల రాక్షసునిఁబోలు కుమారునిఁ గాంచెను. ఆతనికి ఘటోత్కచుఁ డను నామము ప్రసిద్ధమయ్యెను. ఏలయన, నాతని శిరస్సు ఘటమువలె నుండెను.

కొంతకాలమునకు దుర్యోధనుఁడు చేసిన నియమముల ననుసరించి పాండవులు వారి భార్యయగు ద్రౌపదితోడ హస్తినాపురమును వీడి యరణ్యావాసము చేయుటకు వెడలిరి.

వారు శాలిహోత్రుఁడను ముని యాశ్రమమునకు సమీపమున హిమాలయ పర్వతములకు దక్షిణపు పార్శ్వమున వసించు చుండిరి. అచ్చటకుఁ బ్రాంతముననే కుమారుఁడగు ఘటోత్క చునితోడను, నితర రాక్షసవర్గముతోడను హిడింబా దేవి వసించుచుండెను. కుంతీదేవికుమారులలో మధ్యముఁడగు భీమసేనుఁడుదక్క తక్కుంగల పాండుసూనులు ద్రౌపదితోడ ధౌమ్యుఁడను మహర్షి చేయుచుండెడి యాగమునకాహూతులై యచటికి వెడలియుండిరి.

భీమసేనుఁ డొంటరిగ వారికుటీరమును, నా యాశ్రమమును గాపాడుచుండెను. ఇంతకు మున్ను భీముఁడు హిడింబను పెండ్లాడి యామెయందు ఘటోత్కచుని బడసినది యా వనముననే. హిడింబ తాను భీముని భార్యయై యతనితో ప్రథమ సమాగమము నంది, యతఁడు హస్తినాపురమునకు వెడలిపోయినప్పటినుండియు యోగినిగానే తనజీవితము నా యడవిలోఁ గడపుచుండ, భీముఁడు కొన్ని వత్సరముల తరువాత నా వనమునకు వచ్చినటులను, నా సమీపముననే వసించుచున్నట్లును దనతోడి రాక్షస స్త్రీలవలనఁ దెలిసికొని బహుశః భీముఁడు తన్ను మఱచియుండఁడని నమ్మి యతని పునస్సమాగమము నభిలషించినదై, యొక యుక్తి చేయఁ దలఁచెను. తన కుమారుఁడగు ఘటోత్కచు నాతంత్రము నడుప నిర్ణయించెను.

హిడింబ తన కుమారునితోఁ దా నొక వ్రతమును బూనితిననియు, నావ్రతపరిసమాప్తి కొక మహాపురుషుని (లక్షణోపేతుఁడు) రక్తమాంసము లుపవాసాంతమున

పారణకుఁ గావలసియుండెననియుఁ, గాన నరణ్యమెల్ల గ్రుమ్మరి, యట్టి మహాపురుషుని వెదకి యాతనిని పట్టుకొని భుజించుట కా సాయంకాలముననే కొనిరావలయుననియు చెప్పెను. ఈమె తనకుమారుఁడు భీమునిచే నిర్జితుఁడగు ననియు, నంతటఁ దనతో ద్వంద్వయుద్ధమున నీప్రపంచ ములో సాటి యెవ్వఁడును లేఁడని గర్వించు తనకొమరునికి గర్వభంగము తద్విధముగఁ గాఁగలదనియుఁ దలఁచెను. హిడింబ తనభర్త మల్లయుద్ధములో తనకుమారుని మించు నను విశ్వాసముగలది.

'పుత్రాదిచ్ఛేత్పరాజయమ్మ'ను నార్యనీతి ననుసరించి యుత్తమపిత తనపుత్రుని యభ్యున్నతి నభిలషించువాఁ డగు నేని దనను నిర్జింపఁగల పుత్రునిఁ బడయఁ గాంక్షించును. తనకంటెఁ దనకుమారుఁ డధికుఁడగుటకై కాంక్షించును. ఈ సందర్భమున, ఘటోత్కచుఁడు భీమునిఁ దనతండ్రిగ నెఱుఁగఁడు. భీముఁడు ఘటోత్కచుని తన తనుజన్ముఁడని యెఱుగఁడు.

[రంగము- కురుజాంగలమను స్థలమున పాండవులయాశ్రమము : పర్వతారణ్యమధ్యము; సాయంసమయము.]

ఘటోత్కచుఁడు తనతల్లి తన్నెందుల కొక మహా పురుషుని వెదకి కొనిరమ్మనెనో, యటుల గొనిరమ్మనుటలో నామె యభిప్రాయ మేమియో యంతరంగమున తర్కించు కొనక యే మాత్రాజ్ఞానువర్తియై వెడలెను. పుట్టుకచే రాక్ష సుఁడయ్యును ఘటోత్కచుఁడు తనతల్లి చేయనియమించిన పని తప్పనియుఁ, బాపకరమనియు నెఱింగియుండెను. కాని

తల్లియెడ నాతనికిఁగల భక్తియే యాతఁడీపనిఁబూన నాతనిఁ బ్రోత్సహించెను. ఈతఁడు మహాపురుషాన్వేషణమునకై తిరుగుచున్నతఱి నొక బ్రాహ్మణకుటుంబ మాతని కెదు రయ్యెను. ఆ కుటుంబమున నొక జరావిశీర్ణ దేహుఁడు కేశవ దాసను బ్రాహ్మణుఁడును, నాతని ధర్మపత్ని సుశీలయు, యౌవన విరాజితులగు కొమరులు కుశికుఁడను జ్యేష్ఠుఁడును, సుగతుఁడను మధ్యముఁడును, భరతుఁడను కనిష్ఠుఁడును గలరు. వారందఱు నాయడవికి నుత్తరదిశను గల యుద్యమ మను గ్రామమునకుఁ బోవుచుండిరి.

తల్లికోరిక చొప్పున లక్షణోపేతుఁడగు మహాపురుషు నకై వెదకుచున్న ఘటోత్కచున కీబ్రాహ్మణకుటుంబ మెదురయ్యెను. ఆ కుటుంబమున యువకులలో సుగతుఁడను మధ్యమసోదరుఁడు మహాపురుషలక్షణములు కలవాఁడుగ నున్నటుల నిర్ణయించి ఘటోత్కచుఁ డాతనిపైఁ దనదృష్టిని బఱపెను. ఆ బ్రాహ్మణుని కొమరులలో నొకనిని దనతల్లి యాహారమునకై కొనిపోవ నిశ్చయించి ఘటోత్కచుఁడు తన భీకరరూపమును బ్రదర్శింప నా బ్రాహ్మణ దంపతులును, వారి కొమరులు నా ఘటోత్కచునిజూచి భీతినందిరి. వారందఱుఁ దమ్ముఁజంపక విడిచిపెట్టుమని ఘటోత్కచుని దీనముగఁ బ్రార్థించిరి. ఘటోత్కచుఁడు వారితో నొకనియమము చేసికొని తక్కినవారి నందఱ నెట్టిహానింజేయక విడిచిపెట్టుదు నని వాగ్దానముచేసెను. అదేమన, నా కుటుంబములోని సోదర త్రయమున నొక్కరుమాత్రము తనతల్లి కాహారమగుటకు నొప్పుకొన్నచో మిగిలినవారినెల్ల విడుతుననెను. ఘటో

త్కచుఁడు చెప్పిన యీ నియమ మనుల్లంఘనీయమగుట నా బ్రాహ్మణకుటుంబములో నొక్కొక్కఁడును తాను రాక్షసి కాహారమయ్యెదనని తెలిపెను. తద్విధమున కుటుంబములో నిలిచిన వారెల్ల నీ రాక్షసి యాపత్తునుండి తప్పించవచ్చునని తలఁచిరి. సుశీల తాను రాక్షసి కాహారమయ్యెదనన ఘటోత్కచుఁడామె స్త్రీయగుటఁ తన తల్లి పారణకు బనికిరాద నెను.

కేశవదాసు తా నాహారమయ్యెదనన ఘటోత్కచుఁడు "నీవు ముసలివాఁడవు. నీవు నాతల్లి భోజనమునకు కనిష్ఠుఁడవు" అనెను. జ్యేష్ఠపుత్రుని హిడింబ కాహారముగఁ గొని పోనిచ్చుటకుఁ దండ్రి యిష్టపడఁడయ్యెను. జ్యేష్ఠపుత్రుఁడు పారలౌకిక క్రియలను జేయుటకు ముఖ్యుఁడగుట తండ్రికి కష్టంగను ప్రియుఁడగుట సహజము. కనిష్ఠపుత్రుని హిడింబ కాహారముగఁ గొనిపోవుటకు తల్లి సమ్మతింపదయ్యెను. తల్లికి కనిష్ఠపుత్రునిపై ప్రేమ యధికము. సుగతుఁడను మధ్యముఁడు తనంతటఁదానే "నేనే రాక్షసి కాహారముగ వెడలెద"నెనెను. అతఁడు తన తల్లిదండ్రుల నిద్దఱను దన్ను రాక్షసి కాహారముగాఁ బోనియ్యఁగోరెను. ఘటోత్కచునకుఁ దన తల్లి వర్ణించిన మహాపురుషలక్షణము లన్నియుఁ గలవాఁడుగ సుగతుఁడు గానుపట్టెను. సుగతునిఁ దనతల్లి కాహారముగఁ గొనిపోవుటకు ఘటోత్కచుఁడు సమ్మతించెను.

సుగతుఁడు తన వృద్ధ జననీజనకులయు, సోదరులయు సెలవుగొని హిడింబ కాహారమగుటకై సిద్ధమయ్యెను. సోదరు లాతని విడువ లేకపోయిరి. తలిదండ్రులు తమకుఁ బ్రియతరులగు కొమరులను హిడింబకు బలికాకుండ నిలుపుకొనఁ

గల్గినను, మధ్యముఁడగు కొమరునైన విడువలేకపోయిరి. మధ్యముఁడన్ననో తానుడుతభక్తిగ తల్లిదండ్రుల కుపకారము చేయఁగలుగుచున్నాఁడననియు, తద్విధముగఁ దాను కుటుంబమునకు సేవసేయఁ గల్గుచున్నాఁడ ననియు నెఱిఁగి ప్రసన్నచిత్తముతోఁ దన దేహమును హిడింబ కర్పింప నువ్విళ్ళూరుచుండెను.

తమసంతతి కలంకారప్రాయుఁడగు మధ్యముఁడగు సుగతు నాతని తలిదండ్రులు విడువలేక విడువలేక విడిచిపెట్టిరి. అతనిని విడిచిపెట్టి కడుదుఃఖమున మునిగి, బుద్ధిమాంద్యముగలిగి దుఃఖవివశులై యా వృద్ధదంపతులు మూర్ఛిల్లిరి. తనకై దుఃఖించి దుఃఖించి మూర్ఛితులైన తల్లిదండ్రులను, సోదరులను జూచి సహింపలేక సుగతుఁడును మూర్ఛితుఁడయ్యెను.

సుగతుఁడుమూర్ఛదేరి, సాయంకాలమగుట, సమీపమునఁగల నదికరిగి స్నానమాచరించి సాయంసంధ్యావందనమును జేసికొని పరలోక యాత్రకుసిద్ధపడుటకు ఘటోత్కచుని యనుమతి గొని మధ్యముఁ డటనుండి వెడలెను. ఘటోత్కచుఁడు సుగతుని ధైర్యసైర్యముల కచ్చెరువందెను.

[రంగము—అడవిలో నొక కొండవాఁగుగట్టున:
సూర్యాస్తమయ సమయము.]

మధ్యముఁ డేకాంతముగఁ గూర్చుండి తన కుటుంబమును దన దేహత్యాగముచే తానెట్లు కాపాడుచున్నదియు, మానవజీవిత పరిణామాది తత్త్వములనుగూర్చియు తర్కించు

కొనుచుండెను. ప్రశాంత గాంభీర్యవిలసితమగు నచటి ప్రకృతి దృశ్యము, అచ్చటగల వృక్షలతాదులచే మనోహరమగు దృశ్యము, అస్తంగతుఁ డగుచున్న సూర్యభగవానుని దృశ్యము ఇవియన్నియు నాతని మానసమున ధైర్యమును, నచంచలదైవభక్తిని ఉద్దీపనముచేసెను. ఇట్లు ప్రశాంత చిత్తుఁడై యచటఁ గొన్ని నిమేషములు కూర్చుండినపిమ్మట లేచి నదికిపోయి స్నానముజేసి సాయంసంధ్యావందనము నిర్వర్తించు చుండెను.

ఇంతలోఁ గేశవదాసు తన కుమారుఁడగు సుగతు నికై దుఃఖించుచు వెదకుచుండెను. అతఁడు కాన్పింపక పోవుటచే హిడింబచే భుజింపఁబడియుండునని తలఁచెను. దుఃఖము భరింపఁజాలక కొమరునికై యొక్కొక్క తఱి కేకవేయును. సుగతుఁడు లేని ప్రపంచ మాతనికి శూన్యమై కన్పట్టెను. "అయ్యో ! నేనేల సుగతుని ఘటోత్కచునితోడ పంపుట కియ్యకొంటిని?" అనుచు నున్మత్తునివలె కొమరుని దలఁచి తలఁచి వగచెను. తనకోడలును, సుగతునిభార్యయు నగు నా యువతికిఁ గల్గనున్న వైధవ్యదుర్గతికిఁ గడు వగచెను. తనకు గల్గిన పాటునకుఁ గడుగుంది యాత్మహత్య చేసి కొన నిశ్చయించెను. కాని యాత్మహత్య మహా పాపకరమని యట్టి పనికి సాహసింపలేకపోయెను.

నదికివెడలిన బ్రాహ్మణకుమారుఁడెంత సేపటికిని రాకుండుటచే ఘటోత్కచుఁడు కోపించి, పారణసేయుటకై నిరీక్షించుచున్న తనతల్లికడకుఁబోవుట కాలస్యమగునని తొందరపడుచు నాతనికై వెదుకఁజొచ్చెను. ఇంతలో

నొకచో మూర్ఛితుఁడై పడియున్న కేశవదాసును గనుగొని
యాతఁడే సుగతుఁడని తలఁచి యతనిని మేల్కొల్పి పలుక
రింపఁగా నాతఁడు కేశవదాసని తెలుసుకొనెను. అంతట
నాతని గనుగొని "కేశవదాసా! పొరపడితిని. నీకుమా
రుని వేగమే పిలువుము. ఆతఁడెక్కడకుఁబోయెను ? ఇంకను
రాలేదే! నాతల్లి కడకుఁ బోవుట కాలస్యమగుచున్నదే"
అనెను. కేశవదాసునకుఁ గోపమువచ్చి ఘటోత్కచుని
దుడుకుతనమున కాతని నిందించెను. ఘటోత్కచుఁడా బ్రాహ్మ
ణుని తనతప్పు క్షమింపఁగోరెను.

ఘటో:—కేశవదాసా! నీకొమరుని వేగమె పిలు
వుము. నీవు పిలువవేని, నాతనిపేరైనఁ జెప్పుము. కాలస్య
మగుచున్నది.

కేశవదాసు "మధ్యమా! మధ్యమా!" అని
పిలచెను. ఆతని పిలుపునుబట్టి యాబ్రాహ్మణబాలకుని
పేరు మధ్యముఁడని ఘటోత్కచుఁడు నిర్ణయించుకొని తానే
గంభీరమగు కంఠధ్వనితో "మధ్యమా! మధ్యమా!" అని
కేకవేసెను. కుంతి కుమారులలో మధ్యముఁడగు భీమసేనుఁ
డాయరణ్యమున నాసాయంకాలమున నొకచో వ్యాయామ
మొనరించుచుండి యాకేకను విని తన్నెవరో పిలుచుచున్నా
రని, యాపిలుపుధ్వని వినవచ్చిన స్థలమునకుఁబోయి ఘటో
త్కచుని గనుగొని "నన్నేల పిలుచుచున్నా"వని యాతని
నడిగెను. ఘటోత్కచ భీమసేను లొండొరులఁ గాంచినప్పు
డొండొరుల దేహసౌష్ఠవములచే నాకర్షింపఁబడిరి.

ఏలకో భీమసేనునిగాంచినంతనే ఘటోత్కచున కాతనియెడ నకారణ గౌరవభావము జనించెను. తండ్రి కొమరులు తాము తండ్రికుమారులని యెఱుఁగరు. ఇంతకు ము న్నొండొరులఁ జూచియు నెఱుఁగరు. ఏలయన, భీముఁడు హిడింబను వివాహమాడినప్పటినుండియుఁ దండ్రియుఁ గొమరుఁడును నొండొరులఁ జూచుట తటస్థింపనేలేదు. ఇది తల వనితలంపుగాఁ గలిగిన ప్రథమ సంఘటనము. ఘటోత్కచుఁ డింతకుమున్ను తనతండ్రి పరాక్రమాదులనుగూర్చి విని యున్నను నాతనిఁ జూచియుండలేదు. ఘటోత్కచుఁడు భీమ సేనుని గాంచినంతనే "నీవేలవచ్చితివి ? నిన్ను నేను బిలువ లేదే! నేను మధ్యముని బిలిచితి" ననెను.

భీమసేనుఁడు "నేను మధ్యముఁడనే. నా సోదరు లలో నేను మధ్యముఁడనుగదా!" అనుచు తనపేరు మధ్య ముఁడని నిరూపించెను.

ఘటోత్కచునితో మాటలాడుచున్నవాఁడుభీమసేనుఁ డే యగునని కేశవదాసు పోల్చుకొనెను. ఇంతలో దైవమహి మానువర్ణనరూపమగు నొక గీతమును బాడుకొనుచు నుగ తుఁడచటికివచ్చి ఘటోత్కచునెదుట నిలిచి తానాతనితల్లి కడకుఁ గొనిపోఁబడుటకు సిద్ధముగ నున్నాననియు, తన్నుగొని పొమ్మనియు నాతనితో ననెను. కేశవదాసంతట భీమ సేనుని కడకుఁజని తనకుమారుఁడు రాక్షసి కాహారముకాకుం డఁ గాపాడ భీముని బ్రతిమాలుకొనెను.

బ్రాహ్మణుల నిట్లు బాధించుచున్న యా రాక్షసి బారి నుండి యా బ్రాహ్మణకుమారుని రక్షించుట తనధర్మమని తలఁచి, కాపాడెదనని బ్రాహ్మణునితో భీమసేనుఁడు చెప్పెను.

బ్రాహ్మణకుమారుని గొనిపోవచ్చిన రాక్షసుఁడు తనకు హిడింబవలనఁ గలిగిన కుమారుఁడే యైయుండునని భీముఁడనుకొనెను. ఇతరులెవ్వరు నీసంగతి నెఱుఁగరు.

భీమసేనుఁడు ఘటోత్కచునితో "రాక్షసా! ఏల నీ వీ బ్రాహ్మణహింసచేసి యీ పాపమున కొడిగట్టుకొనుచున్నావు? ఈ పాపకృత్యము మానరాదా!" యనుచు నాతని మనస్సు కరుగ హితబోధఁ జేసెను. కాని ఘటోత్కచుఁడు బ్రాహ్మణబాలుని గొనిపోవు నుద్యమము విరమించుకొనలేననియుఁ, దనతల్లి యాజ్ఞ యెంత క్రూరమైనది యైనను, న్యాయవిరుద్ధమైనది యైనను, దాను తలపెట్టిన పనిఁ జేసిగాని తీరెదననియు ఘంటాపథముగ వాక్రుచ్చెను.

భీమసేనుఁడు:—బ్రాహ్మణబాలుని విడిచి యతనికి మారుగ నన్నే నీతల్లికడకుఁ గొనిపొమ్ము. నేను నీవెంట వచ్చెదను.

ఘటోత్కచుఁడు:—నీవంటి మహాపురుషుఁడు నూరేండ్లు జీవించి ప్రజలను గాపాడవలెను. నీ జీవితము కడు ధన్యమైనది. నీ జీవము లత్యంతము విలువ గలవి గదా!

భీమ:—క్షత్రియులు తమ జీవములను స్వీయప్రజారక్షణమునకై వినియోగపఱుపవలయును. స్వార్థమును వీడి, పరార్థమునకై జీవితము ప్రజాసేవలో గడుపవలెను. తన ప్రజలకుఁ బీడకలిగినప్పుడు రాజు వారి కా పీడను దొలఁగించి

వారిని గాపాడవలెనుగదా! నా రాజ్యమున నీ బ్రాహ్మణ బాలుని కీడ్కీడు వాటిల్లినందున నేను చూచుచు నాకేమని యూరకుండఁజాలను.

ఘటోత్కచుఁడు బ్రాహ్మణబాలునికి మారుగ నీ భీమసేనునే కొనిపోవుచో నెంతయు నుచితముగనుఁ నర్హముగను నుండునని తలఁచి యాతనిని గొనిపోఁదలఁచెను.

భీముని యౌదార్యమునకు మనమున నభినందించుచు ఘటోత్కచుఁడు తన బాహుబలమునుగూర్చి స్వోత్కర్షతోడను, ప్రాగల్భ్యముతోడను బల్కెను. తన ప్రాగల్భ్యవచనములకు భీముఁడు భయపడునని ఘటోత్కచుఁడనుకొనెను.

భీముఁడు:—భయమన నేమో నే నెఱుఁగను. నీవును ద్వంద్వయుద్ధమున భయపడవని తలఁచెదను.

ఆమాట కలిగి, ధిక్కారముతో "నే నెవరినో తెలియకున్నావు. నే నీవనమునకు రాజును. రమ్ము! నాతో మల్లయుద్ధమునకు" అని ఘటోత్కచుఁడు భుజాస్ఫాలనమొనర్చెను.

భీముఁడు:—ఈ భుజములే నాకుఁగల యాయుధములు. నా కెట్టి యాయుధములక్కఱలేకయే ద్వంద్వ యుద్ధమున నెవ్వరినైన నెదుర్కొనఁగలను.

"ఇట్టి నిర్వక్ర పరాక్రమశాలి నా తండ్రియొక్కఁడే" యనుచు భీమునిపై ఘటోత్కచుఁడు కలియఁబడెను. అతనిని పట్టి లాగెను. కాని భీమసేనుఁడుమాత్ర మొక్క యంగుళమైనను గదలలేదు. భీముఁడు ఘటోత్కచుని సాహసము

గాంచి పరిహాస ద్యోతకముగ నవ్వెను. ఘటోత్కచుఁ డది గాంచి క్రుద్ధుఁడయ్యెను. ఆ యడవిలోని యొక గొప్పవృక్షమును బెఱికి దానిని భీమునిపై విసరెను. కాని భీమసేనుఁడు వృక్షఘాతమున నేమాత్రముఁ జలింపలేదు. ఆ వృక్ష మాతనికిఁ దగిలి, విరిగి నేలబడెను. సమీపముననున్న నొక పర్వతముపైఁగల యొక ప్రస్తరమునుగొని భీమునివక్షమును తాఁకునట్లు విసరెను. కాని యది యాతని వక్షమును గాయపఱుపలేదు. ఘటోత్కచుఁడు భీముని తనతో ద్వంద్వయుద్ధము చేయ రమ్మనెను. అంతట తండ్రికొమరులు మల్లయుద్ధమునఁ గొంతసేపు పెనఁగిరి. ఘటోత్కచుఁడు భీమసేనుని ధాటికి తాళలేక తనతోఁబోరునతఁడు తన తండ్రియని యెఱుఁగక తండ్రిని తలఁచుకొనుచు 'నాయనా' అని కేకవేసెను. మఱియొకసారి కుమార ఘటోత్కచుఁడు భీము నదిమిపట్టఁగా భీముఁడొక్క త్రోపు త్రోసెను. వెంటనే ఘటోత్కచుఁడు లేచి భీమునితో పెనఁగులాడెను. కొంతసేపైన తరువాత భీమసేనుని బంధించుటకు ఘటోత్కచున కొక యుక్తి స్ఫురించెను. పిలిచినతోడనే భూమినుండి యట నొక యూటనీటిధార వెలువడెను. ఆ నీటితో ఘటోత్కచుఁడు తన నోటిని, హస్తములను కడిగికొని తనతల్లి తనకుపదేశించిన నాగపాశమంత్రము నుచ్చారణమొనర్చి యూపాశము నాతనిపైఁ బ్రయోగించి యాతని బంధించెను. భీమసేనుఁ డీపాశముచే బంధింపఁబడి నిర్జితుఁడై నేలఁబడెను.

ఆ బ్రాహ్మణకుటుంబము నేలఁగూలిన భీముని నాశ్చర్యభయములతోఁ జూచెను. కాని యొక నిమేషమున భీమున

కా మాయాపాశమోక్షణ మంత్రము జ్ఞప్తికివచ్చెను. ఈ మంత్రమును భీమునకు మహేశ్వరుఁడొకానొకప్పుడు బోధించెను. ఈ మంత్రోచ్చారణ మొనర్చుటకుఁ జేతులను, నోటిని గడుగుకొనుటకు భీమసేనునకు జలము కావలసియుండెను. భీమసేనుఁడు నీళ్ళను గొనిరమ్మని బ్రాహ్మణబాలకుని గేక వేసెను. బ్రాహ్మణబాలుఁడు తనతండ్రిచేతనున్న కమండలువును గొని సమీపముననున్న నదినుండి జలమును గొని వచ్చెను. వృద్ధబ్రాహ్మణుఁడు జలపూరితమగు కమండలువును భీమసేనుని కడకుఁ గొనిపోయి భీమసేనుని చేతులలో జలముపోసెను. భీముఁడు శుచియై మాయామోక్షణ మంత్రము నుచ్చరించి పాశమునుండి మోక్షమును బడసెను. ఇంతలో ఘటోత్కచుఁడు తానచటఁ దడయుటకు తల్లి యాగ్రహించునేమో యనుకొనుచు, భీమసేనునితో పెనగులాడక "బ్రాహ్మణ బాలకుని స్థానమున నీవే వచ్చెదనంటివి. జ్ఞాపకమున్నదా?"అనెను.

భీమ :—అభ్యంతరమేమి? అందులకు సిద్ధముగా నున్నాను. నన్ను తీసికొనిపొమ్ము. (భీమసేనుని కుడికన్నదరెను) "ఇది శుభసూచకము."

ఆ వృద్ధబ్రాహ్మణుఁడు ఘటోత్కచ భీమసేనుల వెంట నేమిజరుగునో చూచుటకు వెడలుచుఁ దనభార్యనుబిలిచి "మన సుగతుఁడు మనకు దక్కినాఁడు. మన సుగతునికి మారుగ భీముఁడు రాక్షసికడకు వెడల నియ్యకొన్నాఁ"డని చెప్పెను.

[రంగము—హిడింబాదేవి భవనమునకు ముంగనున్న
పూలతోఁట: వెన్నెలరాత్రి.]

కామరూపధారిణియగు నా హిడింబాదేవి సౌందర్య
రాశియో యనఁ దన చెలికత్తెలగు మందయానాకరేణుక
లతో సల్లాపమొనర్చుచు నొక మల్లెపొదకడ స్ఫటికశిలావేది
కపై నాసీనయైయుండెను. ఆమె తనభర్త తనకడ కెట్లయిన
వచ్చునట్లు చేసికొనవలెనని తానుజేసిన తంత్ర మెంతవఱకు
నెఱవేఱునో తెలిసికొనఁ దహతహపడుచుండెను. భీమసేనుఁ
డావనములో సమీపమున నున్నాఁడని యామెచెలికత్తెలు
చెప్పినమాట నిజమైయుండునో లేదో యని వారితో
వాదించుచుండెను. చెలికత్తె లామెతో ఘటోత్కచుఁడు
తప్పక భీమునిఁ గొనిరాఁగలఁడని హెచ్చరించుచుండిరి.
ఘటోత్కచుఁడు భీమసేనుని హిడింబాదేవి పూలతోఁట
ద్వారము కడకుఁ గొనివచ్చి యాతని నచట నొకతిన్నెపైఁ
గూర్చుండఁబెట్టి తాను లోనికిఁబోయి తల్లితోఁజెప్పి వచ్చెద
ననెను.

గృహారామద్వారముకడనుండి లోనికి వచ్చుచున్న
ఘటోత్కచుని కంఠధ్వని విని కుమారున కెదురేగి కొని వచ్చు
టకై హిడింబ తన భవనమునుండి వెలువడెను. ఘటోత్క
చుఁడు తల్లికి నమస్కరించి నిలిచెను. తల్లి కొమరుని సమీ
పించి, "ఘటోత్కచా! నేనుకోరిన మహాపురుషుని గొని
వచ్చితివా?" అని కౌతుకసంభ్రమములతో నడిగెను. ఘటో
త్కచుఁడు తనతల్లిప్రశ్న కేమి ప్రత్యుత్తరమీయవలెనో తెలి
యక, తత్తరపడుచు, వినయము వెలయ "ఒక మహాపురు

షుఁడు నా వెంట తనంతఁదానే యిచటకు వచ్చినాఁడు. నా సామర్థ్యమువలన నే నాతనిఁ గొనిరాలేను.'' అనెను. అంతట తల్లి ''కుమారా! ఆ వచ్చిన పురుషుఁ డెట్టివాఁ''డని పృచ్ఛ చేసెను. ''ఆతఁడు మహాబాహుబల సంపన్నుఁడు. సమున్నత దేహుఁడు. ఉత్తమవీరుఁడు. మహాపురుషసింహుఁడు'' అనుచు ఘటోత్కచుఁడు చేసిన వర్ణనమునుబట్టి యా వచ్చినవాఁడు తన భర్తయగు భీమసేనుఁడేయని హిడింబ నిశ్చయబుద్ధిగల దయ్యెను.

తన కుమారుని వెంటఁగొని యా మహాపురుషు నాహ్వానించుట కెదురేగెను.

భీముఁడును, తనకు ఘటిల్లిన శుభశకునములవలన ఇది తనప్రియయగు కమలపాలిక యే (హిడింబకే కమలపాలికయను పేరుగలదు. ఆమె పుట్టుకచే రాక్షసియయ్యును, కాలకాటంకటీశ్వరి యను నొక దేవతగా జనులచే భావింపబడెను.) తన్నిట్లామెకడకు రప్పించుకొనుటకుఁ జేసిన మహాతంత్రమని తెలిసికొనెను. ఆతఁడే యామెను జూడవలయునని తొందరపడుచుండెను. హిడింబ దూరమునుండియే భీముని గనుఁగొనెను. అతని దేహసౌందర్యమునుగాంచి విభ్రమాబ్ధిమునింగెను. భీముని నీ మాఱు ఘటోత్కచుఁడు గాంచి తన యహంభావము విడచెను. అతనియెడ భక్తిగౌరవములు నూపెను.

ఇంతలోఁ గేశవదాసుఁడు సకుటుంబముగ భీమసేనుని వెదకికొనుచుఁ బునస్సమాగమమున హర్ష చకితులగు భీమసేన కమలపాలిక లున్నచోటికి వచ్చెను. భీమసేనుని జూడఁ

గనే కేశవదాసునకుఁ గృతజ్ఞతయు, విశ్వాసమును నాతని యెడఁ బ్రబోధితమయ్యెను.

ఘటోత్కచుఁడు తనతల్లికి భీమసేనునిజూపి "ఇదిగో, ఇతఁడే నావెంట నీయుపవాసపారణకై వచ్చిన మహాపురుషుఁ" డనెను. హిడింబ భీమసేనునిగాంచి భక్తిపురస్సరముగా నమస్కరించెను. అంతనామె ఘటోత్కచునిపై వుతిరిగి కోపము నభినయించుచు "కుమారా! యిట్టివారి నేల గొనివచ్చితి" వనుచు, నీతఁడు తన భర్తయనియు, నీతనిని దాను పెండ్లాడుటకు సంబంధించిన కథయు చెప్పెను. హిడింబ భీమునితో రహస్యముగఁ దా నాతంత్రము నెందులకుఁజేసెనో తెలియఁ జెప్పెను. భీమసేనుఁ డామెయవ్యాజప్రేమకును, నామె తన్నాకర్షించుకొనుటకు నెఱపిన వ్యాజమునకును మిగుల ముదమందెను.

తన్ను జయించిన భీముఁడు తన తండ్రియని ఘటోత్కచుఁడు తెలిసికొని హర్షమంది యతనికి సాష్టాంగ ప్రణామ మాచరించెను. భీముఁడు కొమరుని లేవఁదీసి యాతని నాశీర్వదించెను. కేశవదాసు భీమసేను నాశీర్వదించెను. ఆతని కుటుంబ మతని నభినందించెను.

భీమసేనుఁడు తన కొమారు నా బ్రాహ్మణ దంపతులకు మ్రొక్క నాజ్ఞాపించెను. ఘటోత్కచుఁ డా బ్రాహ్మణ దంపతులకు మ్రొక్కి తన తొందరపాటుతనమునకుఁ దన్ను మన్నింపుఁడని వేఁడికొనెను.

కేశవదాసు:—వత్సా! నీవు తల్లియాజ్ఞ నెఱవేర్చితివి. నీ విధిని నీవు చేసితివి. ఇందు నీ తప్పేమున్నది? వీరుని

కొమరుఁడవగుటచే వీరపుత్రోచిత ప్రాభవమును బ్రకటించి తివి''.

హిడింబయుఁ గేశవదాసుపాదములపైఁబడి తనతప్పునకును, తన కొమరుని తప్పునకును తన్ను క్షమింప వేఁడుకొనెను. అంతటఁ గేశవదాసు ''మీరెల్లప్పుడు భీమసేనునితో నుండెదరుగాత''యని దీవించెను. కేశవదాసు భీమసేనుని సెలవుదీసికొని, వెడలెద ననెను. భీమసేనుఁడు ఘటోత్కచు నితో ''నీవెప్పుడును సాధువులకు హింస కల్గింపకుము!'' అని హితబోధయొనర్చి యా బ్రాహ్మణకుటుంబమును వారు వెడలవలసిన గ్రామముదనుక సాగనంపిరమ్మని ఘటోత్కచు నాజ్ఞాపించెను.

భీముఁడు పూర్వము హిడింబను విడినదాదిగ తమకు తటస్థించిన ద్రౌపది వివాహము, ఇంద్రప్రస్థపుర ప్రవేశము, మాయజూదము, అరణ్యావాసము మొదలగు సంఘటనల గూర్చి చెప్పి సంభ్రమాశ్చర్యములను కలుగఁజేసెను. ధౌమ్యుని యజ్ఞము చూడనేగిన సోదరులు వచ్చువఱకు సతీసుతులతో గడపి భీముఁడు వారల వీడ్కొని చనియెను.

## 2. భీమసేన, హనుమంతులు

ధర్మరాజు దుర్యోధనునితో జూదమాడి యోడి తన తమ్ములతోను, భార్యయగు ద్రౌపదితోను బండ్రెండేండ్లు లరణ్యవాసముఁ జేయవలసినవాఁడయ్యెను. పాండవులు ద్రౌపదీసహితులై యరణ్యమున కేగుతఱి, ధౌమ్యాది విప్రులు వారితోఁడ జనిరి. ఆ పాండునందనులు వింధ్యపర్వత ప్రాంతారణ్యములలోను, దక్షిణాపథ ప్రాంతారణ్యములలోను గల ఋష్యాశ్రమముల కేగి యచట కొన్ని దినములు వారితోడి సద్గోష్ఠితోఁ గడపి బహు తీర్థముల సేవించుచు దమ యరణ్యవాసక్లేశము నపనయించుకొనుచుండిరి.

పాండవు లరణ్యములలోఁ దిరుగుకాలమున నొక నాఁడు గంధమాదన పర్వతమును జేరిరి. ఆ పర్వతము భీకరారణ్యములకుఁ దావు. వివిధవర్ణ శోభితములగు పక్షులును, ననేకవిధ మృగములు నందుఁ జూపట్టును. ఆ పర్వతపార్శ్వములఁ గొన్నిచోట్ల స్వచ్ఛమైన స్ఫటికశిలలమీఁదఁ బ్రవహించెడు సెలయేళ్లు చూపఱ కా గిరికన్య కంఠమున ధరించిన ముత్యాలహారములవలెఁ గన్పట్టుచుండెను.

వారు గంధమాదనపర్వతసానువులఁ గల యరణ్యమును బ్రవేశించునపుడు భీకర ఝంఝామారుతము వీచెను. చెట్లనుండి పండి రాలి, యెండిన పత్రములు ధూళితోఁ గలిసి మారుతవేగమున మింటికి లేచెను. వాతాహతిచే ఫెళఫెళార్భటులతో వృక్షశాఖలు విఱిగి నేలఁబడుచుండెను. గాలికి రేగిన ధూళిచే మిన్ను మన్ను తెలియదయ్యెను. చెట్లపై

కెగఁ బ్రాకిన లతలు గాలితాకున నేలఁగూలి మార్గావరోధము గల్గించుచుండెను. పాండవులును, ద్రౌపదియు, ధౌమ్యాదులుఁ దమ కోలలతో వానిని ద్రోసికొనుచు ముందునకెట్లో పోవుచుండిరి.

ఈ గాలిత్రోపునకు ధౌమ్యాది విప్రులు, ధర్మరాజాది సోదరులు నొక్కచోటికిని, భీమసేనుఁడును ద్రౌపదియు వేఱొక చోటికిని ద్రోసివేయఁబడిరి.

గాలి తన తీవ్రతను జూపినంత, భయంకరముగ మేఘములు ఱుఱుమఁ జొచ్చెను. తటిల్లత లాకాశమునఁ జూపట్టెను. ప్రచండవర్షము కురియ నారంభించెను. చల్లని వడగండ్లు పడె. పర్వతములపైఁ గురిసిన వర్షపునీరు పర్వతపుఁ జరియల క్రిందికి భయంకర వేగమునఁ బ్రవహించుచు నచటనున్న చెట్లను వేళ్ళతోఁ బెల్లగించి క్రిందికిఁ ద్రోసివేయుచుండెను. కొంతవడికి గాలియు వర్షమును తగ్గెను. వృక్షలతాదులు నేలఁగూలి త్రోవలెల్ల మఱుఁగుపఱుపఁబడెను. చెదరి పోయిన సోదరులును, ద్రౌపదియు నొక్కచోటకు వచ్చిరి. కఱకు రాలపై ద్రౌపది నడువనేరక మూర్ఛిల్లెను. భీముఁ డామెను మెల్లన గొనిపోయి కుశాస్తరణముపైఁ బరుండఁ బెట్టి మూర్ఛదేరుటకై కదళీపత్రముతో వీవఁదొడంగెను. నకులసహదేవు లామె పాదములొత్తఁ దొడంగిరి. అట్టియెడ ధర్మరాజు ద్రౌపదిం జూచి "క్షత్రియ సుకుమారి రాజపుత్రి యీడ నిట్లిడుముల పడవలెఁగదా. ఇట్టి పాటులకు నేనెగదా మూలము" అని దుఃఖించుచుండెను. ధౌమ్యుఁడును, ఇతర బ్రాహ్మణులును సతిని నూరార్చిరి. శీతలవాయుస్పర్శచే ద్రౌపది మూర్ఛదేరెను.

ధర్మరాజు భీమునితో "సోదరా! ఈ సుకుమారియగు రాజపుత్త్రిని దోడ్కొని యీ శిలలపైఁ బోఁజాలము. ఏమి చేయుదము" అనెను.

భీముఁడు తనకొమరుఁడగు ఘటోత్కచునిఁ దలఁచెను. అంతలో ఘటోత్కచుఁడు తన రాక్షసబలగముతో భీము నెదుట నిలిచెను. భీముఁడు తన కొమరుని కౌఁగలించుకొని "కుమారా! ఈ రాజపుత్త్రి నీతల్లి. ఈమె యీ కఠినశిలలపై నడచి యలసియున్నది. ఈమె నెత్తుకొను"మనెను.

ఘటోత్కచుఁడు ద్రౌపదిని, పాండవులను దానెత్తి కొని, వారివెంటనున్న బ్రాహ్మణుల నెత్తుకొన తన వెంటవచ్చిన రాక్షసుల కాజ్ఞాపించెను. ఘటోత్కచుఁడును, నతని యనుచరవర్గమును ద్రౌపదిని, పాండవులను, వారి తోడి బ్రాహ్మణుల నందఱను గగనమార్గంబునఁ గొనిపోయి గంగాతీరమునఁగల నరనారాయణాశ్రమమైన బదరీవనం బున దించిరి.

ఆ బదరీవనంబునఁ దియ్యనిఫలములు, చక్కని మ్రాను పత్రములు గల వృక్షములనేకములు వారికిఁ గానఁబడెను. అచ్చట వృక్షచ్ఛాయల వారెల్లరు విడిసిరి. సమీపమున ప్రవహించుచున్న గంగాతరంగిణియందు వారెల్లరు స్నాన మాడి తపస్సులను జేసికొనుచుఁ గొన్నిదినము లచటఁ గడ పిరి. అచటనుండి వారు మైనాకపర్వతమును, హిరణ్యశిఖర మును, బిందుసరస్సును జూచివచ్చి యీ బదరీవనముననే యాఱుదినములు వసించిరి. ఒక్కనాఁడు ద్రౌపదియు భీముఁ డును గంధమాదనపర్వతసానువుల విహరించుచు నొక్కచోఁ

గూర్చుండియుండ రమణీయమైనదియు, వేయి రేకులు గల దియు నగు కమలమొకటి గాలిచే నెగురఁగొట్టఁబడి వారి యెదుటఁ బడెను. ద్రౌపది యాకమలంబునుగొని, దాని సుర భిళామోదమునకుఁ జొక్కి, యా పుష్పసౌందర్య నిర్మాణ మున కచ్చెరువడి, "యిది యొక్క పువ్వేయయ్యును ఎంతటి ఆ నందము కలుగఁ జేయుచున్నది! నాథా! ఇట్టి పుష్పము లీ సమీప మున నే కొలంకునందైన నున్నచో మరికొన్ని పూవులు కోసి కొనివచ్చి, యిచ్చి నాకు మనఃప్రియంబు సేయుఁ"డని యా పుష్పమును భీమునకుఁ జూపెను.

భీముఁ డామె కోర్కె నెఱింగి ధనుర్బాణంబులఁ గొని కమలంబును గాలి కొనివచ్చిన దిశ కేగెను. అతఁడు కదళీతరు చ్ఛాయలలోనుండి వెడలి, అనేకములగు పుష్పముల సౌరభ ముల నాఘ్రాణించుచు రుచ్యఫలముల భక్షించుచు నుత్సా హముతో సౌగంధిక కమలమును గొనివచ్చుటకు బయలు దేఱెను. అతఁ డతివేగమున నడువఁజొచ్చెను.

అతఁడు నడుచు వేగమునకుఁ జెట్లును, లతలును జలిం చెను. అతఁడు తనకడ్డువచ్చిన లతలను పెఱికివైచి ప్రక్కలకుఁ ద్రోసివైచుచుండెను. చెట్లకొమ్మలను విరిచి దూరముగఁ బడవేయుచుండెను. శైలగుహలలోనుండిన సిద్ధ సుర భుజంగ గరుడ గంధర్వ కిన్నర కామినులెల్లరు భీముఁడు వేగముగ వెడలుటను గనుఁగొనిరి. ఈ విధముగ మదగజమువలె విజృంభించి గంధమాదన పర్వత సానువులగల యడవుల నుండి భీముఁడు వెడలుచుండెను.

ఇతఁడు వెడలునపుడు సింహనాదముఁ జేసెను. ఆ భీకర ధ్వనికిఁ బక్షులదరిపడి యెగిరిపోవుచుండెను. ఆ పక్షుల కాళ్ళు తడిసియుండుట నతఁడు కనుగొని సమీపముననే కొల నొకటి యుండవలయునని యూహించి యతివేగమున జని యొక సరోవరమును గాంచెను. ఆ సరోవరతటమున పనస, తమాల, తాలవృక్షములు, కదళీతరుషండములు గలవు. గాలితాకున నా చెట్లన్నియు నూగుచుండెను. ఆ తటాకము శీతలజలపూర్ణమై గాలిచేఁ దరంగితమగుచుండెను. భీముఁ డా కొలనుగని, యందుఁజొచ్చి స్నానమొనరించి యందలి తామరపుష్పములను బొడవైన మృణాళములతో పెఱికి చేతికి యా మృణాళ వలయములను గంకణములుగా నలంకరించు కొనెను. ఆ సరస్సు నంటి యతివిస్తృతమైన యరటితోట గలదు. భీముఁ డా కదళీషండమును బ్రవేశించి తనశంఖము నూఁదెను. ఆ శంఖధ్వని యురుముల ధ్వానమువలె భీకరమై దిక్కులదరెను.

అచట నొక గుహలో సుప్తుఁడైన హనుమంతుఁ డను కపి యాధ్వని కదరిపడి మేల్కొని, తనలో "ఈ మహా ధ్వానం బెవ్వరిది? ఇట్టి ధ్వని నాయనుజుండగు భీముని శంఖ ధ్వానమే" అనుకొని సంతోషముచేఁ బులకితశరీరుండగుచు భీమునకు మార్గనిరోధముగా మహావృక్షములఁ గొన్నిటిని బడవైచి తన శరీరము నతివిస్తృతముగావించి యడ్డముగ నా పథంబున బరుండి తనతోకతో భూమిని పెద్ద ధ్వనియగునట్లు తాటించెను. ఆ ధ్వనికి భీముండు విస్మితుండై కదళీవనమధ్య మున కేగిచూడ నచట నొక విశాలమైన శిలపై యోగనిద్ర

యందున్న యొక ముదుసలికోతినిజూచి యతనికి నిద్రాభ
గము గావింపనోడి సింహనాదమునుజేసెను. ఆ నాదమున
హనుమంతుడు ఉలికిపడి లేచి భీము ననాదరంబునంజూచి యిట్ల
నె: "అయ్యా! ముసలితనముచే, రోగముచే నలసి సుఖని
పోవుచున్న నన్నేల మేల్కొల్పితివి? జంతువులకు ధర
ధర్మంబులు తెలియవుగాని సర్వభూతదయాస్వరూపంబై
ధర్మమెఱింగినవారు గదా మనుజులు! అట్టి మనుష్యజన్మ
నెత్తియు దయావిహీనుండవై గర్వించి నాబోంట్టి పేదమ్మ
ములకు భయంబు గలుగ గర్జించితివి. నీవెవ్వండవు? మ
ష్యుల కగోచరంబైన యీవనంబున కెట్లువచ్చితివి? గ
సంచారము చేయంగల సిద్ధులుగాని యిచటకు రానేర
అమృతతుల్యంబులైన యీ ఫలమూలములు భుజించి వెడ
పొమ్ము. నీయెడ నాకు స్నేహభావము కల్గినందున ని
చెప్పితి" ననిన భీముండిట్లనియె: "ఓ కపిరాజా! నేను క్ష
యుండను. ప్రసిద్ధమైన బలముగలవాండను. పాండురా
కుమారుండను. కుంతికి వాయు దేవునివరమునం బుట్టినవాండ
నన్ను భీముం డందురు. నేను కార్యార్థినై ముందునకుపో
యును. నాకుం ద్రోవనిమ్ము. అట్లీయవేని పూర్వమొకప్పు
సముద్రమునుదాంటి లంకకుంబోయిన హనుమంతునట
నిన్నును నీ శిలను దాటిపోయెద" నన హనుమంతుం
తానేమియు నెఱుంగనట్లు "ఆ హనుమంతుండనువాం డెం
లకు సముద్రమును లంఘింప వలసినవాండయ్యెనో నీకుం

సినఁ జెప్పు"మని భీముఁ డడిగెను. అంత భీముఁడు శ్రీరాముని చరిత్రమును దిఙ్మాత్రముగఁ జెప్పెను.

"ఇక్ష్వాకు కుల ప్రదీపుఁడగు శ్రీరాముఁడు పితృవాక్యపరిపాలనార్థ మడవికేగి యచటనుండ నతనిభార్య యగు సీతను లంకేశ్వరుండగు రావణుండు గొనిపోయెను. సీత నన్వేషించుటకై రాముని మిత్రుఁడైన సుగ్రీవుని అనుచరులగు కపివరు లరిగిరి. త్రోవలో సంపాతియను పక్షివలన వారు సీత రావణునిచేఁ గొనిపోఁబడెనని యెఱింగిరి. వారి నాయకుఁడగు హనుమంతుఁడు సముద్రమును లంఘించి లంకను జేరెను. నేనును నా హనుమంతునంతటి బలముగలవాఁడనే. నా పౌరుషమును నీకుఁజూపుదునా?" అనిన హనుమంతుఁ డవ్యాయికమగు నొక చిరునవ్వు నవ్వి "అన్నా! నేను కడుముసలివాఁడను. లేవలేను. నీవు వెళ్ళుదువేని నాతోకను గ్రోచివైచి పొ"మ్మనిన భీముఁడు లీలతో తన యెడమచేతితో నాతని తోకను దొలఁగింపఁబోగా అదికదలనందున తన రెండుచేతులతో దానినిబట్టి యధికప్రయత్నమునఁ గదల్పఁజూచినను గదలనందున నింకను తన బలమునంతను వినియోగించెను. అతని శరీరమున స్వేదజలధార లురలఁ జొచ్చెను. అందుకు మిక్కిలి సిగ్గిలి భీముఁడు తలవంచుకొనెను. అతనిగర్వము పటాపంచ లయ్యెను. అంతట భీముఁడు హనుమంతున కెదురుముఖుండై నమస్కరించి "నిన్నెఱుంగక దురుక్తంబులాడితిని. మన్నింపుము. నీవు కపిరూపముధరించిన సిద్ధుఁడవో గంధర్వుఁడవో నాకుఁ దెలియఁజెప్పు"మన హనుమంతుఁడు భీమునితో నిట్లనెను: "నేను కేసరిక్షేత్రమున వాయుభట్టారకునకుఁ బుట్టి

తిని. నీవు వర్ణించిన హనుమంతుఁడను నేనే. నీవు నాకు తమ్ముఁడ వగుదువు. తొల్లి శ్రీరాముఁడు వానరసైన్యమును గొని లంకకుఁబోయి రావణుని సంహరించెను. నేను రాముని కుఁ జేసిన సేవ కాతఁడు నన్ను మెచ్చి నాకీర్తి యెంతకాలము నిలుచునో యంతకాలము నేను నిత్యుఁడ నగుచు నుందు నని వరము దయచేసెను.'' అనెను. భీముఁ డాకథను విని సంతసించి మరల నాతనికి నమస్కరించి ''నీదర్శనంబున నేను కృతార్థుఁడనైతి''ననెను. అని, భీముఁడు,

''సముద్రమును లంఘించిననాఁటి నీ రూపమును జూడఁగోరెదఁ జూపు''మన హనుమంతుఁ డిట్లనియె:

''అక్కాలపు రూప మిప్పు డెట్లు చూపఁగలను? కాల మొక్కవిధమున నుండునా? ఇప్పుడు వృద్ధుఁడనైతిని. యుగములు మాఱినవి. యుగధర్మంబులు మాఱినవి.'' అనుచు కృత త్రేతా ద్వాపర కలియుగ ధర్మంబులన్నిఁ జెప్పెను. భీముఁడంత ''ఆనాఁటి నీతనువుఁ జూపినఁగాని వెడల''నన హనుమంతుఁడు తనరూపమును జూపెను.

చ. అతులితమై ద్వితీయకనకాద్రియొకో యిదినా నిజాంగము
  చ్ఛ్రితముగఁ బెంచి పుచ్ఛమునఁ జేసి దిగంతములంటుచున్న యు
  న్నతుఁ గపినాథుఁ జూచి, కురునందనుఁ డప్డు నిమీలితాక్షుఁడై,
  సతి నతివిస్మితుండగుచు మారుతి కిట్లనియెన్ భయంబునన్.

ఆరూపమును భీముఁడుచూచి భయమంది యీభీషణ రూప ముపసంహరింపు మని హనుమంతుని ప్రార్థించినఁ దన యెప్పటిరూపంబు నాతఁడు చేకొనెను. భీముఁడు

మరల హనుమంతునితో "అన్నా! నీ వింత బలవంతుఁడ వగుటచేతనే రావణు నంత సులభముగ శ్రీరాముఁడు చంపఁ గల్గె" ననెను.

హనుమంతుడు:—అయ్యా! నీవు సౌగంధిక సరోవరంబునకుఁ బోవుచున్నావు. ఆ సరోవరము యక్షరాక్షస రక్షితమై దేవతోపభోగ్యమైయున్నది. దేవతల యనుగ్రహ సంపాదనము ముఖ్యము. వారు బలి, హోమ నమస్కారాదుల చేతను, 'భక్తి' ప్రాధాన్య కర్మములచేతను సాధ్యులు గాని, సాహసక్రియాసాధ్యులుగారు. నీ వచట సాహసంబుచేయ వలదు. మీకుఁ గీడొనరించిన ధార్తరాష్ట్రులపైకి దండెత్తి వారిని వధియించి నీకు సహాయముచేసెదను. (భీమునిపైఁ గల్గిన ప్రేమచే ముసలితనమువలని తనయశక్తతగూడ మరపింపఁజేయఁబడి హనుమంతుఁడు ఆతని వీరప్రకృతి విజృంభింపఁ బై విధముగఁ బల్కెను.)

భీముఁడు:—అన్నా! కౌరవులతోడి యుద్ధము నీ కేపాటిది? కౌరవుల నోడించుటకు మేమే చాలుదుము.

హనుమంతుఁడు:—అట్లయినచో నీయందలి సోదర భావంబున మీలో నతిరథుండైన యర్జునుని రథధ్వజంబున నేనునిలిచి మీబలపరాక్రమంబులఁ జూతును.

అని హనుమంతుఁడు భీమునిఁ గౌఁగలించుకొని యాతనికి సౌగంధిక సరోవరమార్గంబు జూపి సాగనంపెను.

తదాలింగనంబున భీమునకు నూతనోత్తేజము, జవము, శక్తి యుం గల్గెను.

భీముం డడవిమార్గముల నడచి రజతగిరికి సమీపము నంగల కుబేరుని యుద్యానవన మధ్యమున సౌగంధికకమల సరోవరమును గాంచెను. ఆసరోవరంబునంగల కమలంబులు హేమవర్ణ విరాజమానములై, మనోహరసురభిళంబులై యుం డుటం జేసి యాకమలషండము మీఁదనుండి వీచువాయువు తన పుత్రుండగు భీమసేనునకు స్వాగతమొసంగెను. ఈసరో వరంబును వేలకొలంది రాక్షసులు కావలి కాచుచుండిరి. ఆ రాక్షసులు భీమునిపైఁబడి "ఇది కుబేరుని క్రీడోద్యానవనము. అతం డీసరస్సునం దనస్త్రీలతో జలక్రీడఁ జేయును. ఇచ్చట కెవ్వరు రానోపరు. ఈసరోవరంబున దేవర్షులు తపస్సు చేయుదురు. ఇందలి జలంబు లమృతోపమానంబులై యుం డును. వైడూర్యములవలె శోభించు నాళములుగలిగి మిగుల మనోజ్ఞమైన సువాసనగల కమలంబు లుండుటచే ఇది రాక్షస గణంబుచే రక్షింపఁబడుచున్నది. నీ వెవ్వఁడవు? ఎందులకిచటికి వచ్చితి"వని యడిగిరి. అంత నతఁడు "నేను పాండురాజు కుమారుఁడను. నా పేరు భీముఁడందురు. నేను ధర్మరాజు తమ్ముఁడను. నా భార్య ద్రౌపదికి మనఃప్రియంబొనర్ప నీ సౌగంధిక కమలంబులఁ గొనిపోవ వచ్చినాఁడ" ననెను. అవ రాక్షసు లతనితో "నీవు దివ్యపురుషునివలెనున్నావు. నీవు కుబేరునితోఁ జెప్పి నీకు వలసినన్ని కమలంబులఁ గొనిపొ" మ్మనిరి

"పర్వతసానువులనున్న యీసరస్సు కుబేరుని దెట్లయ్యెను? ఈసరస్సుయొక్క యుపయోగము నెల్ల రనుభవింపవచ్చును. ఇది యాకుబేరుని దొక్కనిదే యెట్లయ్యెను? ఉత్తమ క్షత్రియుఁడు తనకు వలసినదాని నింకొకని నర్థింపఁడు. తన భుజబలమున సంపాదించి యర్థులకిచ్చి తనకీర్తి వెలయించును. మీయొక్క, మీకుబేరునియొక్క యనుజ్ఞలను గొనికాని యీకమలంబులు కొనిపోరాదా?" యనుచు భీముఁడు ఆసరోవరంబుఁ బ్రవేశించి, కొన్నికమలంబులు పెఱికి సౌగంధికనాళములుగలవానిని తనకంఠంబున నలంకరించుకొని, అందలి జలంబుఁగ్రోలి యధికబలయుక్తుఁడై యారాక్షసులతోఁ బోరెను. రాక్షసులు భీమునిచే దెబ్బలుతిని కుబేరునితో మొఱపెట్టుకొనిరి. భీముఁడు సౌగంధిక కమలంబులను గొని ద్రౌపదియున్న యెడకుఁ బోవుచుండ ధర్మరాజును, ధౌమ్యుఁడును, ద్రౌపదియు భీమునికై వెదకుచు నెదురుగవచ్చిరి.

భీముఁడు ధౌమ్యధర్మజులకు మ్రొక్కి ద్రౌపదికి సౌగంధిక కమలంబు లర్పించి వానిని గొనివచ్చిన విధమును వివరముగఁ జెప్పెను.

ధర్మరాజు భీమునిఁజూచి "యీకమలంబులకై యింతటి సాహసకృత్యములు చేసితివే! ఇట్టిసాహసము లొనరింపకు" మని హితోపదేశ మొనరించెను. ద్రౌపదియుఁ దానుకోరిన సౌగంధిక కమలంబులు భీముఁడు గొనిరాఁగా, ప్రహృష్టచిత్తయయ్యెను.

తమమనసున కెక్కిన సతులు కోరినవస్తువులను పురుషులు తమప్రాభవము ప్రకటించుచుఁ గొని తెచ్చియిచ్చుట సంప్రదాయమేకదా! సీతారామలక్ష్మణులు పర్ణశాలలో నివసించునప్పుడు సీత బంగారు మాయలేడిని చూచి దానినిగొని వచ్చి తనకిమ్మని భర్తను కోరఁగా, శ్రీరాముఁడు దానిని దరిమి తరిమి జీవములతో నుండఁగా దానినిపట్టుకొనలేక విసిగి దానిపై నొక్క బాణమును బ్రయోగింప, మాయరూపముదాల్చిన మారీచుఁ డను నారాక్షసుఁడు చనిపోవుచు "అలో లక్ష్మణా!" అని రాముని కంఠధ్వనితో కేకవేసి చనిపోవుటయు, అది తనభర్త కంఠధ్వనియేయని సీత తలఁచి, లక్ష్మణునితో కొన్ని దుర్భాషలాడుటయు, లక్ష్మణుఁడును సీతనొంటరిగ పర్ణశాలలో విడిచి యన్నకై యెదురేగుటయు, నట్టితఱిని సీతను రావణుఁడు గొనిపోవుటయు మొదలగు సంఘటనలవలన శ్రీరాముఁడు రావణుని సంహరించుటయు నను నీకథ విస్తరమగుట యెల్లను తనభార్యకోర్కెను దీర్చుటకై శ్రీరాముఁడు చేసిన యత్నమువలననేకదా!

—

# 3. అభిమన్యుఁడు

అభిమన్యుఁడు భారతవీరులలో నొకఁడు. అర్జునునకు సుభద్రవలనఁ గల్గిన కుమారుఁడు. తండ్రికిఁ గీర్తి దెచ్చినవాఁడు. ఇతఁడు బాల్యము తన మేనమామలయింటఁ బెరిగి యుద్ధవ్యాపార నిపుణతఁ గాంచెను. పువ్వు పుట్టినతోడనే తనపరిమళము వెదజల్లునట్లు ఇతఁడును చిన్నవయసుననే తనప్రతిభను గురుపాండవ సంగరమునఁ బ్రదర్శింపఁ గల్గెను.

ఒకనాఁటి యుద్ధమునఁ గౌరవులు పాండవసేనలకు నగ్ని పరీక్షయనఁదగు నొక పద్మవ్యూహము బన్నిరి. దానిని భేదించుట సాధ్యము. ఇందు సైనికులు చక్రాకారముగా నిలిచి యుందురు. అందుఁ బ్రవేశించు వీరుఁడు తా నెట్లు ప్రవేశించునో, యెట్లు వెలికిఁ బోవలయునో తెలియని విధమున సైన్యములు నిలిచియుండును. ఇట్టి మొగ్గరము ప్రవేశించి ప్రాణములతో వెలువడుట సామాన్యముగాదు.

ఈ వ్యూహమును పాండవ పక్షమువారెల్లరుఁ బ్రవేశింపనోడిరి. ధర్మరాజు భయపడి, యందుఁ బ్రవేశింప సమర్థులెవ్వరని యోచించెను. అర్జునునికుమారుఁడగు నభిమన్యుఁడే యీ మొగ్గరమును భేదింప నర్హుండని నిశ్చయించి యాతనినిఁ బిలిచి యిట్లనియె: "కుమారా! అర్జునుఁడును, కృష్ణుఁడును, నీవును దక్క మఱెవ్వఁడు నీవ్యూహమును బ్రవేశింపఁజాలరు. నీవే యీ మొగ్గరంబుఁ బ్రవేశించి మాకెల్ల రకును సంతోషము గల్గింపుము." అంతట నభిమన్యుఁడు ప్రసన్నవదనుఁడై "దీనిని

నభేదించువిధమును మామాయన నాకుఁజెప్పెను. నే నందుఁ
బ్రవేశించి నాకెదురువచ్చు వీరులఁ జించి చెండాడెదను. వీరు
నెల్లరు నొక్కుమ్మడి నాపైఁ బడినప్పుడు బయటకు
వచ్చు నుపాయము నే నెఱుంగను. అందు నే ప్రవేశించు
నేర్పును, నాపరాక్రమమును జూపెద" నని యుత్సాహము
తోఁ బలికెను.

ధర్మరాజంతట నభిమన్యునితో "నీవు పద్మవ్యూహ
మును జొచ్చిన నీవెనుకనే మేమెల్లరమును వత్తుము. నీవు
ప్రవేశింతునని వాగ్దానముచేసి ప్రవేశింపఁ గడఁగుదువేని
యంతియె చాలును." అనెను.

భీముఁడు:—అభిమన్యూ! నీవెనుకనే నేనును, ద్రుప
దుఁడు, విరటుఁడు మొదలగు మేమందఱమును బ్రవేశించి
శత్రువుల నుఱుమాడమా!

తన వెనువెంటనే వచ్చెదమని తన్ను మొగ్గరముఁ
బ్రవేశింపఁ బురికొల్పుచు, ధర్మజ భీమసేనులు పలికిన వాక్య
ము లుత్సాహంబుగల్గింపఁ దన బంధుసంతతితోఁ దాసుజచ్చి
నను నది యుత్సవతుల్యంబని యెంచి భీమసేనునితో నభి
మన్యుఁడిట్లనియెను: "తండ్రీ! నేను, ద్రోణుఁడు సంతో
షించునటులు యుద్ధముచేసెదను. ధర్మజులు నన్నుగారవించి
యిక్కార్యమునకు నేనర్హుండనని నియమింప, నేను వారి
యాజ్ఞను నిష్ఫలముచేయుదునా? నరుఁడును సుభద్రయుఁ
దనయునిగాంచి సంతసముదాల్చుట యంతయు రిత్తబుత్తునా?
గోపబాలుఁ డాలమందలఁదోలునట్లు శత్రునివహములఁ దోలి
వైచెదను. ఈయుద్ధములో నాప్రతాపము ప్రకటించి నా

తండ్రియు, నామామయు సంతోషించునటులును, రాష్ట్రములు దద్దరిల్లునటులును యుద్ధమొనర్చెద" నని వీరాములాడుచు సుమిత్రుఁడను తనసారథిని బిలిచి రథంబును మన, సారథి యభిమన్యునితో "నీవు బాలుఁడవు. నీవెన్నడును యుద్ధముచేసి యెఱుఁగవు. శత్రుపక్షమున గల ద్రోణుఁడు మొదలగు సైన్యాధిపతులు నీచేతఁ జచ్చువారు కారు." అనెను.

సారథిమాటల కభిమన్యుఁడు నవ్వి "దేవగణముతో పురారిగాని, బలారిగాని నన్నెదుర్కొనినచో వారిని జయించెదను. అట్టియెడ ద్రోణుఁడన నొకలెక్కయా?" అనెను. వీరావేశము గల్గినవాని వీరాలాపముల కొకమేర యుండునే! వారల కెట్టి ప్రబలవీరునైనను దమ ప్రతాపాగ్ని కింధనముగఁ జేయఁగల మనిపించును. మెఱుపుమెరసిన ట్లభిమన్యునిరథము వ్యూహమునఁ బ్రవేశించెను. అతనిని వెన్నంటి వచ్చు భీమాదివీరులను కౌరవ పక్షపాతియగు సైంధవుఁడు అడ్డగించి వారికి వ్యూహమున ప్రవేశము గలుగకుండ జేసెను. అభిమన్యుఁడు రౌద్రమూర్తియై కొంత వడి రణవిహారముసలిపి పెక్కువీరుల నుక్కడంచెను. అంతట నభిమన్యునిఁదాఁక నుద్యమించు దుర్యోధనునిఁజూచి ద్రోణాచార్యుఁడు సైనికుల కెల్లఁ దనచేతితో సంజ్ఞ చేసెను. అంతటఁ గృపాచార్యుఁడు, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణుఁడు మొదలగు వీరులెల్ల రొక్కుమ్మడి నభిమన్యు నెదుర్కొనిరి. వారెల్లరు నభిమన్యునిపై బాణవర్షము గురియించిరి. అతఁడా బాణములనెల్లఁ దప్పించుకొనుచు యుద్ధ మొనర్చెను. అంత

నభిమన్యుఁడు కర్ణునిఁదాఁకెను. కర్ణునిపై బాణములఁ బ్రయో గించెను. ఒక్క బాణము కర్ణునికిదాఁక నాతఁడు మూర్ఛిల్లెను. అభిమన్యుఁడు ధృతరాష్ట్రుని సుతులనెల్లఁ దఱిమివైచెను. అట్టితఱి నభిమన్యుని పరాక్రమమును స్తుతించు సిద్ధ విద్యాధరుల నాదంబులు మింట మొరసెను. శల్యుఁడంతట నభిమన్యు నెదుర్కొనెను. అభిమన్యుఁ డాతనిపైఁ బది బాణములఁ బ్రయోగింప నవి యాతని యంగమున గ్రుచ్చుకొనెను. శల్యుఁడంత నభిమన్యుని ధాటి కాగలేక అతని శారినుండి తప్పించుకొనెను. ద్రోణాది వీరవరులెల్ల నభిమన్యునిఁజుట్టుకొనిరి. అభిమన్యుఁడు ధనుష్టంకారముఁ జేయుచుఁ బిడుగులు గురియు ప్రళయకాల వలాహకమువోలెఁ జూపట్టెను. ఎడతెగని బాణవర్షమును సైన్యములపైఁ గురియించుచుండ ద్రోణుఁడు నేమియు చేయఁజాలక నెఱఁగుపడి చూచుచుండెను. దుర్యోధనుఁడు కర్ణాది వీరవరులఁ బిలిచి వారితో "ద్రోణుఁడు తనప్రియశిష్యుఁడగు నర్జునుని కుమారుఁడగు నీ యభిమన్యునిఁ బెద్దఁజేయుచుఁ బొగడ్తకు మెచ్చుచుండెఁగాని యతని నొంపఁడు కాన మీరెల్ల రా గురుని యుపేక్షచేసి యభిమన్యు నొక్కమ్మడి ముట్టడింపుఁడని ప్రేరేపించెను.

ద్రౌపదివస్త్రముల నొలుచుటలోను, జూదముననోడిన పాండవులఁ బరాభవించుటకై చేసినయకృత్యమునకును బేరు మోసిన దుశ్శాసనుఁడు భారతయుద్ధమున నొకపోటు వీరుఁడై నిలచి తనయన్నపలికిన పలుకులచే ప్రబోధితుఁడై యిట్లనెను: "సూర్యునిఁ గబళింపఁబోవు రాహువువోలె నేనొక్క

రుండనె పోయి యభిమన్యుని సంహరింపనోపుచున్నను. ఈలోపు చచ్చినట్టుల కృష్ణార్జునులు విందు లేని శోకభరమున నాసు చత్తురు. అంతటితో మనపగ దీఱఁగలదు. నాభుజబల మింగితో చూపెదనని వీరాటోపము లాడెను (నాఁడు సభలో ద్రౌపది వస్త్రముల నొలుచుటవంటి యుత్కృష్టావహ కార్యమే యాది యని తలఁచియుండనోపు).

అభిమన్యుఁ డాతనిపై శరవర్షము కురిపించి క్షతగా త్రునిఁ జేసెను. ద్రౌపదికిని తనదండ్రులకును గావించిన యప చారము తలంపునకురాఁగా, నభిమన్యుఁ డతనితో——

చ॥ అనఘుని ధర్మనందనుని • నాసభనమ్మెయి నీవునొవ్వఁ బ
లిక్కిన ఫలమందఁజేసెదఁ జ • లింపక యించుక సేపు నిల్వుమీ
విను లఘుచిత్తుఁ గ్రూరునవి • నీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెం
చిన గురువంపుఁ దండ్రులకుఁ జిత్తమెలర్ప ఋణంబు దీర్చెదన్.

అనుచు నాతనిని తఱిమెను.

దుర్యోధనుని కుమారుఁడగు లక్ష్మణుఁ డభిమన్యుని దాఁకెను. వీరిరువురును బులిపిల్లయు, సింగపుకొదమయు బోరినట్లు పోరిరి. అభిమన్యుఁ డాతనిపై బాణములఁ బ్రయో గించి యాతని బాహువుల గాయపఱచెను. మఱియొక బా ణము ప్రయోగించి యాతనిశిరము నేలడొల్లనే సెను. అంతట సైన్యములందు హాహాకారములు వెడలెను. దుర్యోధనుని పక్షపు వీరులకెల్ల రోషము ప్రజ్వరిల్లెను. కర్ణాది మహా వీరవరులంద ఱొక్కుమ్మడి నభిమన్యునిపైఁబడిరి.

ద్రోణుఁ డభిమన్యుని జూపికొని వారితో నిట్లనెను: "ఇతఁడును, నర్జునుండును నొక్కరూపుగలవారు. నే నర్జునునకు నేర్పిన కవచధారణ మీతనికి బాగుగఁదెలియును. ఇతనిచేత విల్లున్నంతవఱ కితని నోడించుట దుర్ఘటము. ఎట్లో వంచనచే నితనిచేతనున్న విల్లువిరిచియు, నీతని యరదము నీడ్చు హయములఁ జంపియు, సారథినిజంపియు, నితనిని విరథునిఁ జేసితిమేని యితని నోడింపఁ గల"మనియె. కర్ణుఁ డా ద్రోణుని వాక్యములను విని యభిమన్యుని చేత నున్న వింటిని ద్రుంచెను. అంతలో ద్రోణుఁ డతనియశ్వములఁ గూల్చెను. కృపుఁ డాతని సారథినిఁ జంపెను. యుద్ధతంత్ర న్యాయమునకు విరుద్ధముగా వారంద ఱొక్కపెట్టున నాతని నిరాయుధుని గను, విరథునిగను జేసివైచిరి.

అంత నాతఁడు చక్రమును చేతఁగొని పైకెగసెను. ఆతనినిఁజూచి కురువీరులు భయమందిరి. శకుని, కృతవర్మ, కృప, కర్ణాదివీరులెల్ల రాతనిచక్రమును దునియలు చేసిరి. తక్షణమె యతఁడు గదనుగొని యశ్వత్థామనుగదిసి యతనిరథ్యంబులను, సారథినిఁ జంపెను. తనకడ్డమువచ్చిన వీరులనెల్లరఁ దనగదతో మోది చంపెను. దుశ్శాసనుని కొమరుఁడు గదగొని యాతని నెదిర్చెను. ఈ భ్రాతృకుమారయుగము ఘోరమగు గదాయుద్ధమున పెనగి యొండొరులను గ్రూరముగఁ జావ మోదికొని చచ్చిరి.

భారతవీరవరులలోఁ బిన్నవయస్సున పెదతండ్రిపను పున వీరుల కభేద్యమగు పద్మవ్యూహంబునుజొచ్చి 'లోకైక వీర' బిరుదునకుఁదగినట్లు యుద్ధమొనర్చి కన్న తండ్రికి సార్థక తనుజన్ముఁడనఁదగునట్లు తనవిధిని నెరవేర్చి వీరస్వర్గ మలంకరించిన యభిమన్యుఁడు వీరరత్నముగదా!

క॥ పెక్కండ్రు గూడి యిమ్మెయి
నొక్కనిఁజంపుట యధర్మ మోహో యని న
ల్దిక్కులను బెద్దయెలుగున
నక్కజముగ భూతసంచయంబులు పలికెన్.

# 4. పరశురాముఁడు

పరశురాముఁడు భృగుమహర్షి సంతతివాఁడగుటభార్గవ రాముఁడనఁబడును. దశరథుని కుమారుఁడగు రాముఁడు రఘుమహారాజు సంతతివాఁడగుటవలన రాఘవరాముఁ డనియు, రఘురాముఁడనియు, రాఘవుఁడనియు పేరులతనికిఁగలిగెను. పరశురాముఁడు తేజస్వంతుఁడగు బ్రాహ్మణమహర్షియగు భృగువుసంతతిలోనివాఁడయ్యు క్షాత్రతేజోవిభాసితుఁడై తనజీవితముసాగడపెను. బ్రాహ్మణవంశమున సుప్రసిద్ధవీరుఁడై, తనతండ్రి నొక క్షత్రియుఁడు తానింటలేనప్పుడు చంపినందున క్షత్త్రియవంశమును నిర్మూలమొనర్ప భీషణప్రతిజ్ఞబూని యిరువదియొక్కసారులు క్షత్రియకుటుంబముల నాశమొనర్చిన వీరుఁ డితఁడు.

పరశురామునిగూర్చిన గాథ స్కాందపురాణమున సహ్యాద్రిఖండమునఁ గలదు. ఇతనితండ్రి జమదగ్ని; తల్లి రేణుక. రేణుక (ఆదిమాయ) పార్వతియవతారమనియు, జమదగ్ని శివాంశ సంభూతుఁడనియు, వీరికొమరులు నల్వురిలో పరశురాముఁడు కనిష్ఠుఁడనియు, నాతఁడు విష్ణ్వంశమునఁ బుట్టినవాఁడనియుఁ జెప్పఁబడినది.

భృగువంశపుబ్రాహ్మణులు హైహయులను క్షత్రియులకు కులగురువులు (పురోహితులు) గా నుండిరి. హైహయవంశపు క్షత్రియులు తమ కులగురువులకు కడు వితరణముతో ధన ధాన్యాది సంపత్తులను గలుగఁజేసిరి. వారిచ్చిన కానుకలు, భూ

దానములతో భార్గవవంశపు బ్రాహ్మణులెల్లరు గొప్పధనికు లైరి. ఒకానొకప్పుడు హైహయులు దురదృష్టమువలన ధనలోపముగలిగి తమవలన ధనవంతులైన బ్రాహ్మణులను దమకుఁ గొంతధన మిమ్మని యర్థించిరి. అందులకు బ్రాహ్మణులు తమయొద్ద ధనము లేదనిరి. హైహయవంశపు క్షత్రియు లెల్ల తమ పౌరోహిత్యపు బ్రాహ్మణులపై, వారి కృతఘ్నతకు మిగుల భీకరమగు రోషముజనించి వారా బ్రాహ్మణవంశమును నిర్మూలముఁజేయఁదలఁపడిరి. చేఁజిక్కిన బ్రాహ్మణుల నెల్లరను జంపివేసిరి.

గర్భిణులుగానున్న స్త్రీలు కొంద అడవులకు బాఱి పోయిరి. మఱికొందఱు గర్భిణీస్త్రీలు హిమాలయపర్వత ప్రాంతములకుఁ బాఱిపోయిరి. తద్గర్భస్థ శిసువులనుగూడఁ జంపివేయఁ బగఁబూని, యాక్షత్రియులు వారిని వెన్నాడి తరిమిరి.

అట్టి గర్భిణీస్త్రీలలో నొకతె పాఱిపోవుచుండఁగా నొక క్షత్రియుఁ డామెను పట్టుకొనఁబోవుతఱిని గర్భస్థశిశువు మహాకోపముతోఁ దల్లితొడనుండి వెలుపలికివచ్చి తన దుర్నిరీక్ష్య తేజముచే నారాజులనెల్లర గ్రుడ్డివారినిగావించెను.

ఆబాలుఁడు తల్లియూరువునుండి యుద్భవించెనుగాన నాతని కౌర్వుఁ డను పేరు వచ్చెను. ఔర్వుఁడు కొంతతడవైన తరువాతఁ దన తేజముచేఁ గ్రుడ్డివారలుగాఁజేయఁబడిన క్షత్రియులకెల్ల దృష్టినిబ్రసాదించెను. కాని యౌర్వుఁడు, క్షత్రియులు తనబ్రాహ్మణజాతికిఁ గావించిన యపచారమును మాత్రము మఱచియుండలేదు. ఇతఁడు క్షత్రియవంశమును

నాశము గావించుటకు గొప్ప తపస్సు జేసెను. ఆ ఘోరతప మాచరించుతఱి నాతని పితృదేవతలెల్లరుఁ బ్రత్యక్షమై యాతపస్సును మానుమనియు, తీవ్రకోపమును విడనాడు మనియు ననుశాసనవాక్యముల నాడిరి. అందుపై నౌర్వుఁడు తన కోపాగ్ని నొకముద్దగాఁ జేసి సముద్రమునఁ బాఱవైచెను. ఆ యౌర్వుని కోపాగ్నియే సముద్రగర్భమున నంతర్వాహిని యైయున్న బడబాగ్ని. అంతనాతఁడు దనతపస్సును విడనాడి యస్త్రశస్త్రాదికమగు జ్ఞానము నెల్లఁ దనకుమారుఁడగు ఋచీకునకిచ్చెను. ఆతనినుండి వంశక్రమానుగతముగ నస్త్రశస్త్రాదికమగు జ్ఞానము పరశురామునకుఁ బ్రాప్తించెను.

భారతమునఁ బరశురాముని ప్రసక్తిగలదు. ఇతఁడు ద్రోణునకు గురువని చెప్పఁబడియున్నది. ఒకానొకప్పు డితఁడు భీష్మునితో యుద్ధ మొనర్చెను. కర్ణుఁడు బ్రాహ్మణవేషమునఁ బరశురామునికి శుశ్రూషఁ జేసి యతనియనుగ్రహముఁ బడసి యతనివలన నస్త్రశస్త్రాదివిద్య నభ్యసించెను. విలువిద్యలో కర్ణుఁడు కడు నేర్పరియయ్యెను. ఒకానొక సమయమునఁ బరశురాముఁడు తనతలకు కర్ణునితొడను తలగడగఁ జేసికొని నిద్రించుచుండెను. అంత నేదో యొకపురుగు కర్ణుని తొడను దొలిచివేయుచుండెను. రక్తము కాలినుండి కాల్వలు గట్టి ప్రవహించుచుండెను. క్షత్రియుఁడుగాన క్షత్రియసహజమగు సహనశక్తిగలవాఁడగుట, కర్ణుఁ డాబాధను సహించి గురువునకు నిద్రాభంగమగునని కదలక మెదలక యూరకుండెను. కొంతసేపటికి పరశురాముఁడు మేల్కొ నికర్ణుని కాలినుండి స్రవించురక్తమునుగాంచి, పురు గావిధమున తొడను దొలిచి

వేయుచున్నను నిశ్చలుఁడై యున్న బ్రాహ్మణ వేషధారియగు తనశిష్యునిఁగాంచి "ఇట్టి సహనశక్తిగలవాఁడు క్షత్రియుఁడే కాని బ్రాహ్మణుఁడుగా డని మనమున నిశ్చయించుకొని "నీవిటుల క్షత్రియుఁడవై యుండి బ్రాహ్మణవేషమున నన్ను వంచించి నావద్ద విద్యగఱచితివిగావున నావిద్యయంతయు వ్యర్థమగుఁగాక" అని కర్ణుని శపించెను.

రామాయణమునఁగూడ నీతని ప్రసక్తిగలదు. శివధనుర్భంగ మొనర్చి సీతను పెండ్లాడి యయోధ్యకుఁబోవుచున్న శ్రీరాము నెదుర్కొని పరశురాముఁడు "నాగురువగు శివుని విల్లు విఱిచితివి. నాతోఁ బోరు"మని ద్వంద్వయుద్ధమునకుఁ దలపడెను. శ్రీరామునిచేఁ బరశురాముఁడు ఓడిపోయెను. పరశురాముఁడు రఘురాముని శౌర్యమునకు మెచ్చి తనవిల్లు నమ్ములు నాతని కిచ్చివేసెను. అంతట పరశురాముని క్షాత్రతేజము దాశరథికి సంక్రమించెను. రామాయణ, భారతకాలముల రెండింటను జీవించియుండిన పరశురాముఁ డెంతకాలము జీవించెనో!

భారతారణ్యపర్వమునఁ బరశురాముని జన్మమునుగూర్చిన ప్రశంసగలదు. కన్యాకుబ్జనగరమును రాజధానిగాఁ జేసికొని పాలించుచున్న 'గాధి'యను క్షత్రియవంశపు రాజకుమార్తెయగు సత్యవతిని ఋచీకుఁడు వివాహమాడెను. ఋచీకుని వంశకర్తయైన భృగువే ఋచీకునకుఁ బ్రత్యక్షమై యావివాహమునకు మిగుల హర్షించి యాదంపతుల నాశీర్వదించెను. అప్పుడు సత్యవతి తనతల్లి కొక కుమారుని, దనకొక కుమారుని బ్రసాదింప భృగువును వేఁడెను.

భృగు వంతట పాయసమును రెండుపాత్రములలో నుంచి, సత్యవతిని, నామెతల్లిని నదిలో స్నానముచేసివచ్చి యాపాత్రములలోని పాయసమును భక్షింపుఁడని వారి కా రెండు పాత్రలనిచ్చెను. సత్యవతితల్లి, భృగువు సత్యవతికిఁ దనకంటె మంచికుమారుఁడు కల్గునట్లు ప్రసాదించునని సత్యవతికిచ్చిన పాయసమును దాను భక్షించి, తన కొసంగిన పాయసము నామెకు మార్చివేసెను. భృగువు జరిగిన మోసమును గనిపెట్టి సత్యవతితో ''నీయశ్రద్ధచే నీకిచ్చిన పాయసపాత్ర తాఱుమారైనందువలన నీకు క్షాత్రతేజోవిరాజితుఁడగు వీరపుత్రుఁడు కల్గును. నీతల్లి తపశ్శాలియగు మహర్షిని పుత్రునిగాఁ బడయు''ననెను. కాని సత్యవతితల్లి తనకు వీరపుత్రుఁడే కల్గునట్లు మార్పుచేయ భృగువును బ్రార్థించెను. భృగువు తనవాక్కు మోఘమనెను. అయిన నొక్క మార్పు మాత్రము చేయుదుననెను. క్షత్రియవీరలక్షణము లామె మనుమనికే కలుగునట్లు చేసెదననెను. తత్ప్రభావమువలననే గాధికి విశ్వామిత్రుఁడను రాజర్షి యుద్భవించెను. క్షాత్రతేజముతో జమదగ్ని యను పుత్రుఁడు సత్యవతికి జన్మించెను.

జమదగ్ని రేణుక యను రాచకన్నను వివాహమాడెను. ఆమె యయోధ్యను బాలించు ప్రసేనజిత్తుని కుమార్తె. తండ్రి బ్రాహ్మణుఁడు. తల్లి క్షత్రియవనిత. ఈదంపతులకు జనించినవాఁడు పరశురాముఁడు క్షాత్ర తేజోరాశి. పరశురామునకు శివుఁడు దివ్యమైన పరశువును, బ్రహ్మాస్త్రమును బ్రసాదించెను. ఇతనికిఁ బరశువే ప్రధానాయుధముగుటఁ

బరశురాముఁడనునది సార్థకనామమయ్యెను. జమదగ్ని తన యాశ్రమమును గంగానదియొడ్డున నిర్మించుకొని యందు వసించుచు నచ్చటనే నిరంతరము తపస్సు చేయుచుండెను. ఒక దినమున రేణుక గంగాజలమును గొనివచ్చుటకుఁబోయి యచ్చట గంగానదిలో నొకరాజు తన భార్యలతో నతివినోదముగ జలక్రీడలాడుచుండఁగా జూచి చలించెను. ఈదృశ్యమును జూచుచు రేణుక నీళ్లుగొని వచ్చుట మఱచి యాలస్యము చేసెను. జమదగ్ని తన దివ్యదృష్టిచే నామె మానసిక వ్యభిచారమొనర్చినటులఁ దెలిసికొని యామె యాలస్యముగఁ గుటీరమునకు రాఁగా "నీవు వ్యభిచరించితివి. నాకుటీరముననుండ నర్హవుగావు. వెడలిపొ"మ్మనెను. అంతటితో నాగక, తనకొమరులలో నొకని బిలిచి, దుష్టురాలగు తల్లిని నఱికివేయ నాజ్ఞాపించెను.

ఆతఁడు "నేనిట్టి క్రూరకర్మ చేయఁజాల"నని వెడలిపోయెను. ఇట్లే తక్కిన కొమరులును జేసిరి. కనిష్ఠుఁడగు పరశురాముఁడు పిత్రాజ్ఞచే మాతృవధమంతటి యధమకార్యము చేయవలసివచ్చినను, నట్టి యాజ్ఞాపాలనము పుత్రుఁడగువాని కవశ్యమని నిరూపించుటకుఁబోలెఁ దల్లిని దయలేక చంపివైచెను. తరువాతఁ దాను జేసిన పనికిఁ గడు వగచెను. పరశురాముఁడు తనయాజ్ఞ నెరవేర్చినందులకు సంతోషించి తండ్రి యాతని నొకవరము వేఁడుమనెను. అంతటఁ బరశురాముఁడు తండ్రియాజ్ఞ మీఱినందున, శపింపఁబడి చనిపోయిన తనసోదరులను, తల్లికిఁ బూర్వాపరాధము

స్మృతిలేకుండునట్లు జేసి, తానుజంపిన తల్లిని బ్రతికింపఁ గోరెను. జమదగ్ని వారినెల్లర బ్రతికించెను.

హైహయవంశపు క్షత్రియులు తమపగ నింకను భృగువంశపువారిపైఁ జూపుచునేయుండిరి. వారిలోఁ గార్త వీర్యుఁడు (కార్తవీర్యార్జునుఁడు) జమదగ్ని యాశ్రమ సమీపమునఁగల యడవి కొకదినమున వేఁటకై వెడలి జమదగ్ని కుటీరమును సమీపించెను. రేణుకాదేవి కార్త వీర్యున కాతిథ్యమొసఁగి మృష్టాన్నభోజన మిడెను. ఆశ్రమ వాసినియగు జమదగ్నిసతి యిట్టి మృష్టాన్నభోజన మెటులఁ దనకుఁ బెట్టఁగలిగెనోయనియు, నాదంపతులయం దేదో మహత్త్వ ముండుననియుఁ దలఁచి యామెను, నట్టిభో జనమెట్లు సమకూర్పఁ గల్గితివని యడిగెను. తనభర్త జమదగ్ని వద్ద కామధేనువు గలదనియు, దానిమహిమవలననే తానట్టి భోజనము సమకూర్పఁగల్గితిననియు నామెచెప్పెను. కార్తవీ ర్యార్జునుఁడు జమదగ్నికడకుఁబోయి కామధేనువును దనకిమ్మని వేఁడెను. జమదగ్ని ఆకామధేనువు నిచ్చుటకు నిరాకరించెను. కార్తవీర్యార్జునుఁ డాయావును, వత్సమునుగూడఁ గొనిపోవు చుండఁగాఁ బరశురామునికిఁ దెలిసి కార్తవీర్యార్జునుని జంపి కామధేనువును వత్సమును గొనివచ్చెను. కార్తవీర్యార్జునుని కొమరులు తమతండ్రినిజంపిన పరశురామునిపైఁ బగదీర్చి కొననెంచి జమదగ్నియాశ్రమమునకువచ్చి యామహర్షిని జంపిరి. అప్పుడు పరశురాముఁ డాశ్రమమున లేఁడు. అతఁడు కుటీరమునకు రాఁగానే తల్లి జరిగినకథ తెలిపెను. అంతట పరశురాముఁడు తనతండ్రికిఁ బారలౌకిక కర్మములనుజరిపి తన

తండ్రినిజంపిన క్షత్రియులపైఁ దనపగ సాధింతునని ప్రతిన బూనెను.

హైహయుల రాజధానియగు మహిష్మతీ నగరమును నాశమొనర్చి యతఁడు కార్తవీర్యార్జునుని కొమరులనెల్లఁ జంపెను. అది మొదలుగ నిరువదియొక్కమారులు క్షత్రియ కుటుంబములనెల్ల నాశమొనర్చెను. వారిరక్తముతో నైదు హ్రదములను గావించి యారక్తాంజలులతోఁ బితృదేవతలకుఁ దర్పణమొనర్చెను. అంతటఁ బితృదేవతలెల్ల నామునికిఁ బ్రత్యక్షమై యాతనిని దీవించిరి. ఆతని మూలపురుషుఁడగు భృగువు పరశురాముని పాపపరిహారమునకై కొన్నినదులను పేర్కొని యందు స్నానమాచరించి తపస్సుచేయుమని విధించెను. పరశురాముఁ డట్లేచేసి తపస్సునకై బంగారువేదిక నొకదానిని నిర్మించుకొనెను. పిదపఁ బృథివికంతకుఁ బ్రభువై యశ్వమేధయాగము నొనరించి తాను నిఃక్షత్రియముగాఁ జేసిన భూమినంతను గశ్యపుండను బ్రాహ్మణునకు యజ్ఞదక్షిణగా ధారవోసెను. కశ్యపునకు దానముగా నియ్యఁబడినది గాన నీ భూమికి 'కాశ్యపి' యను నామము గలిగెను. పరశురామునకు మహా పశ్చాత్తాపముగలిగి పాపపరిహారమునకై తన కుఁగల సర్వస్వమును దానముగానిచ్చివేసి తాను నిలుచుటకు తావులేకుండఁ జేసికొనెను. లౌకికసంపదలెల్లఁ బోయినను దపోనిధుల దేహములఁ బ్రాణములున్నంతవఱకును నాత్మశక్తి విజృంభింపకుండనుండదు.

పరశురామక్షేత్రము:—

పూర్వ మొకప్పుడు మనహిందూదేశమునకు పడమటి సముద్రము (అరేబియాసముద్రము) పడమటి కనుమలనఁ బడు పర్వతశ్రేణికి మిక్కిలి సమీపముననే పర్వతపాదములను దాఁకుచునుండెను. పరశురాముఁడు క్షత్రియులనెల్లర నిరువదియొక్కసారి చంపినపిమ్మటఁ గశ్యపునకు భూదానము చేసి తాను నిలుచుటకు తావులేక యొకదినమునఁ బశ్చిమ సముద్రతీరమునఁ దిరుగుచుఁ బడమటి కనుమలకును, సముద్రము నేలనంటిన ప్రదేశమునకును మధ్యమున నిలిచి సముద్రమును వెనుకకు పోవలసినదని ప్రార్థించెను. అతని ప్రార్థనమువలన సముద్రము కొంతదూరము వెనుకకుఁబోయెను. అంతట బయలుపడిన నేలపై పరశురాముఁడు వసించుచుండెను. ఈ నూతనప్రదేశము పరశురామునిచేఁ గశ్యపునకు దానముచేయఁబడిన భూమిగాక నూతనసృష్టి. పరశురాముఁడు తన్నేమిచేయునో యను భయము చేతనే కాని యాతనియందుఁగల భక్తిచేఁగాదు సముద్రము వెనుకకుఁబోయినది. ఈ నూతనముగ వెలువడిన భూమినే పరశురామక్షేత్ర మందురు.

# 5. పండిత జవహర్‌లాల్ నెహ్రూ

జవహర్‌లాల్ నెహ్రూవంటి మహనీయుని జీవితము లోని విశేషములను తెలిసికొనుటచే సామాన్యజనులు తమ జీవితములనుకూడ చక్కబరచుకొనఁ గలుగుదురు. దేవు-డిచ్చు సహజశక్తులను స్వయంకృషిచే వృద్ధిచేసికొని కొందఱు గొప్పవారగుదురు.

జవహర్‌లాల్ మోతీలాల్ నెహ్రూ అను న్యాయవాదికి ఏకైక పుత్రుఁడు. మోతీలాల్ నెహ్రూ భారతమాత పిలుపును విని, త్యాగియై జైలుజీవిత మనుభవించి జాతీయ నాయకుఁ డయ్యెను.

జవహర్‌లాల్ పూర్వీకులు కాశ్మీరమునకు చెందిన వారు. పూర్వమీ కాశ్మీర దేశమే దేవభూమియని పిల్వఁబడెను. అచట ప్రాచీన కాలమున తపోధనుల ఉపదేశంములు, ఆత్మతేజము సుస్ఫుటముగ నుండెడివి. ఆ దేశమున ప్రకృతి దృశ్యములు మనోహరములు. కాశ్మీర దేశస్థుల స్వచ్ఛ శరీరచ్ఛాయ, విశాల వక్షములు, స్ఫురన్నేత్రములు వారు శుద్ధ ఆర్యులని సూచించును. కాశ్మీర దేశములో రెండువందల యేండ్ల క్రితము మొగలుల సామ్రాజ్య మంతరించఁగా, అచటినుండి ఆ ప్రాంతములను విడిచి వేరొక దేశమునకు వెడలిపోయిన వారిలో 'రాజకౌలు' అను బ్రాహ్మణుఁడు యమునాతీరపు ఢిల్లీ జేరి అక్కడవృత్తిని కల్పించుకొని ఖ్యాతిగాంచెను. అప్పటి ఢిల్లీ పాదుషా యతనిని దర్బారు పండితునిగ గ్రహించి ఒక జాగీ

కును, యమునానది కాలువప్రక్క నొక భవనమును బహు మానముగ నొసఁగెను. రాజకౌలు రాజకుటుంబమునకు సంస్కృతము, పారసీ భాషలను నేర్పుచుండెను. ఆ ప్రాంతపు వ్యావహారిక హిందీభాషలో కాలువకు 'నహర్' అని పేరు. ఆ కుటుంబము కాలువ సమీపమున నివసించుటచే వారిని కౌలు - నహర్ అని పిలుచుచుండిరి. నహర్ అనుపదమే కాలక్రమమున నెహ్రూ అయి వారి వంశనామముగ నిలిచెను. ఆ నెహ్రూవంశములో నందలాల్ అనునతఁడు ఆగ్రా హైకోర్టులో రికార్డు తర్జుమాదారుగానుండి తరు వాత వకీలు పరీక్ష నిచ్చి న్యాయవాది యయ్యెను. హైకోర్టును ఆగ్రానుండి అలహాబాదుకు (గంగా యమునా సంగమము) మార్చిరి. నందలాల్ న్యాయవాద వృత్తిలో నుండి అలహాబాదులో ప్రముఖుఁడైన న్యాయవాదియై చాల ధనము గడించెను. ఇతని తమ్ముఁడు మోతీలాల్, అన్నయగు నందలాల్‌తో అలహాబాదులో చదువుకొని, పారసీ, అరబ్బీ, హిందుస్తానీ భాషలలో విద్వాంసుఁడాయెను. మోతీలాల్ అన్నతో ఆగ్రా చేరునప్పటికి పండ్రెండేండ్ల వయస్సుగలవాఁడు. నాలుగు సంవత్సరము లచట చదివి ఎంట్రన్సు పరీక్షలో కృతార్థుఁడాయెను. 1877 సంవత్సరమున అన్నగారితో అలహాబాదుచేరి అచటి ప్రభుత్వ కళాశాలలో బి. ఏ. తరగతివరకు చదివెను. మోతీలాల్ అతని విద్యార్థి దశలో సాహసి. పెంకెజట్టునకు నాయకుఁడై పేరు గడించెను.

అతని బి. ఏ. పరీక్ష ఆగ్రాలో జరిగెను. మొదటి రోజు పరీక్ష పత్రమునకు జవాబు వ్రాసెను. తరువాత పరీక్ష

పత్రములకు జవాబు వ్రాయుటకు పరీక్షకులు నడుపుచుండెను. వానిని ఆగ్రాలోని తాజ్, జుమ్మా మసీదు మొదలగు భవనములను చూచుటలో కాలముగడపెను. ఆకాలమున విద్యార్థులు బి. ఏ. కాకున్నను-హైకోర్టు వకీలు పరీక్షకు పోవచ్చును గాన అతఁడు వకీలు పరీక్షకుపోయి 1884 సంవత్సరములో ఆ పరీక్షలో కృతార్థుఁడయ్యెను. మోతీలాల్ కాన్పూర్ కోర్టులో న్యాయవాదిగా పనిచేసి మంచి ప్రజ్ఞ, అనుభవము సంపాదించెను. అన్న నందలాల్ 1887 లో మరణించెను. మోతీలాల్ న్యాయవాదులలో ప్రముఖుఁడాయెను. అత్యధికమైన రాబడి అతని న్యాయవాద వృత్తిలో లభించినందున ఆ ధనముతో ఆనంద భవన మను గొప్ప భవనమును కట్టించి అందు వసించెను. ప్రతివత్సరము లక్షలకొలఁది రూప్యము లార్జించెను.

జవహర్‌లాల్ నెహ్రూ మోతీలాల్, స్వరూపరాణి దంపతుల యేకైకపుత్రుఁడు. ఇతఁడు 1889 సంవత్సరము నవంబరు నెల 14-వ తేదిన అలహాబాదులో ఆనందభవనమున జన్మించెను. జవహర్ బాల్యము సకల సౌకర్యములతో గడచెను. ఇంగ్లీషుదాదు లాతని కాంగ్ల భాషను నేర్పిరి. ఇతనికి ఇంటనే ప్రత్యేక గురువులచే చదువు చెప్పించిరి.

తమ యింటిలో నుండి చదువుకొను కాలేజీ విద్యార్థులు తనకంటె పెద్దలగువారు సంభాషించునపుడును, తన తండ్రి మిత్రులతోఁ జేయు సంభాషణలను ఈబాలుఁడు శ్రద్ధతో విని మంచిజ్ఞానమును సంపాదించుచుండెను. ప్రజలు ఆంగ్లేయ ప్రభుత్వము తమకు చేయుచున్న అన్యాయములను గూర్చి చెప్పుకొనుమాట లాతని మనమున నాటెను. జవహరుకు

తండ్రియనిన భయము. తల్లిదగ్గఱ చాల చనువుగ నుండెడి వాఁడు. తనకు గల్గిన సందేహములను తల్లినడిగి తెలిసికొను చుండెడివాఁడు. ఇతని తండ్రి వ్రాఁతబల్లపై రెండు చక్కని ఫౌంటెన్ కలము లుండెనఁట. తండ్రికి రెండు ఫౌంటెన్ కలము లేల యని తానొకటి తండ్రి నడుగకయే తీసికొనెనఁట. తన కుమారుఁడా కలమును తీసికొనెనని తెలిసికొని తండ్రి యతని కా వయస్సున చోరత్వ మబ్బఁగలదని అతనికి బుద్ధిచెప్పుటకు గట్టిగకొట్టెను. కాని అతనికిదెబ్బ తగిలినదని తెలిసి తండ్రి బాలు నికి దెబ్బ తగిలినచోట ఔషధము చరిమి ఉపచారము చేసెను.

ఇతఁడు బాల్యములో ఒక మున్షీయొద్ద హిందూస్థానీ భాషను, ఒకపండితునియొద్ద సంస్కృతభాషను నేర్చెను. ఇతనికి బాల్యమున పెద్దతండ్రి భార్య పురాణగాథలను, వీరుల కథలను చెప్పుచుండెను.

ఇతనికి పండ్రెండేండ్ల వయస్సుననే ఇంగ్లీషు నేర్పు టకు ఎఫ్. టి. బ్రూక్సు అను నాంగ్లేయుని కుదిర్చిరి. అతడు గొప్ప థియాసఫీప్రచారకుఁడు.అతఁడు జవహర్‌లాల్‌నే ఆంగ్ల సాహిత్యమును,ప్రకృతిశాస్త్రమును,ఉపనిషత్తులు, భగవద్గీత, ధమ్మపదము (బౌద్ధగ్రంథము), గ్రీకుతత్వగ్రంథములను చదివించెను. ఈయనకతనికడ చదువుకొనునప్పుడే బహువిధగ్రంథ పఠనాసక్తి ప్రబలెను. సౌమ్యజీవనము, సత్ప్రవర్తనము అల వడెను. అనిబీసెంటీతనిని థియాసఫీ సంఘమున సభ్యునిగాఁ జేర్చుకొనెను. ఆమెప్రతిభ, వాగ్ధాటి, చర్చాశక్తియు నీతని హృదయమున నాటెను. థియాసఫీ సంఘమువారు

చేసిన పత్రికా ప్రచారాదులవలన మన దేశము పూర్వ మెట్టి యౌన్నత్య మనుభవించెనో, తరువాత బ్రిటిషువారి పరి పాలనలోనికి ఎట్లు వచ్చెనో, మనజాతి కాత్మగౌరవ మెట్లుండ వలెనో అను విషయములు మనమున హత్తుకొనెను.

జవహర్‌లాల్ బాల్యమునుండియు వార్తాపత్రికా పఠనమువలన మన దేశ పరిస్థితులు, మన దేశ పారతంత్ర్యము, రాజకీయాందోళనములు బాగుగ నవగాహనము చేసికొను చుండెను.

1902 సంవత్సరమున దక్షిణాఫ్రికాలో ఆత్మరక్షణకై బోయర్లు బలీయులగు బ్రిటిషు వారితో సాహసముతో పోరు సాగించిరని విని మన భారత దేశ మెన్నడు బ్రిటిషువారి పాలనమునుండి తప్పించుకొని స్వతంత్ర దేశ మగునా యని తలపోసెను.

## విదేశవిద్య

జవహర్‌కు పదునైదేండ్ల వయస్సురాగానే, తండ్రి, కుమారుని నున్నత విద్యకై ఇంగ్లండులోని గొప్ప కళాశాల లలో చదివించుటకు పంపనెంచెను. అచ్చటి కళాశాలలందు ఆధునిక బోధకు, విజ్ఞానార్జనకు అవకాశములు హెచ్చనియు, ఎక్కువ ప్రజ్ఞ, స్వతంత్రబుద్ధి, కార్యశూరత గల యాంగ్లేయు లతో కుమారునికి సాహచర్యము కల్గినచో అతఁడు మిక్కిలి సమర్థుఁడు, చతురుఁడునై వకీలువృత్తినవలంబించి తనకెక్కుడు పేరుప్రఖ్యాతులను తేఁగలఁడనియాశించెను. మోతీలాల్ సకు టుంబముగ 1905 సం. న ఇంగ్లండు వెళ్ళి అచటి ప్రసిద్ధమగు

'హేరో' పబ్లికుస్కూలులో జవహరును చేర్పించి, యూరపు యాత్ర ముగించి స్వదేశమునకు తిరిగివచ్చెను. 'హేరో' ఉపాధ్యాయులు గొప్ప విద్వాంసులు. అచ్చటి విద్యాబోధనా పద్ధతులు పూర్తిగా ఆంగ్ల సాంప్రదాయపువి. ప్రభువులు, ధనాఢ్యులే అచట తమ బిడ్డలను చదివింపఁగలరు. ధన వ్యయ మధికము. అచటి విద్యార్థులకు విద్యతోఁబాటు ఆంగ్ల దేశ సంఘమర్యాదలను నేర్పుదురు. జవహరులాల్ ఆ పాఠశాలలోఁ జేరినప్పు డచట బరోడా, కపుర్థలా సంస్థానాధిపుల కొమరులు చదువుచుండిరి. జవహర్ అచట ధనికులగు వారితోపాటు విద్యనేర్చెను. లాటిన్, ఫ్రెంచి భాషలను కూడ నతఁడు నేర్చెను.

అతఁడు వార్తాపత్రికలఁ జదువుచు, ప్రపంచ దేశ రాజకీయాది సమస్యలను గ్రహించుచుండెను. రాజకీయ సమస్యల కెల్ల మూలసూత్రములఁ దెలుపు గ్రంథములఁ జదివెను. హేరో ప్రొఫెసరొకరు క్రొత్తగా ఇంగ్లండులో నేర్పడిన మంత్రివర్గమునుగూర్చి బాలుర నడుగఁగా, క్లాసులోని ఆంగ్ల విద్యార్థు లెవరును జవాబీయలేకపోఁగా, జవహరు, ఆమంత్రు లందరి పేరులను తెల్పి, ఏ శాఖమంత్రి యెవ్వరో వివరములను సరిగా చెప్పఁగా, ఆప్రొఫెస రాశ్చర్యపడెను.

యూరపులో ఇటలీ దేశము అప్పు డాస్ట్రియా రాజున కధీనమైయుండెను. ఇటాలియనులు మన హిందువులవలెనే పరస్పర విభేదములతో కలతపడుచుండిరి. వారిలో గారిబాల్డి అను దేశభక్తుఁడు ఇటాలియనులకు ఐక్యబుద్ధి, స్వాతంత్ర్యవాంఛ, జయోద్రేకమును గల్గించుచు వారు స్వతంత్రు

లగుటకు మార్గదర్శకముగ వ్రాసిన గ్రంథములు జవహారుకు బహుమతిగా నీయఁబడఁగా నతఁడు వాని నధికాసక్తితోఁ జదివెను.

హైస్కూలు చదువు పూర్తిచేసి 'కేంబ్రిడ్జి' లోని 'ట్రినిటీ' కళాశాలలో విద్యార్థిగఁ బ్రవేశించెను. ప్రకృతి శాస్త్రబోధకు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయము పెట్టినదిపేరు. అచట ప్రకృతిశాస్త్రపరిశోధనలు జరుగుచుండును. జవహారు కచట బాల్యమున ప్రకృతిశాస్త్రాభిరుచి కలిగి, అతఁడు పెద్దవాఁడైనకొలఁది, బాగుగ నభివృద్ధియగుచు వచ్చెను. విమాన నిర్మాణాదుల నతఁ డత్యాసక్తితో గమనించుచుండెను. అక్కడ రసాయనశాస్త్రము, భూతత్వ శాస్త్రము, వృక్షశాస్త్రము అభిమాన విద్యలుగ నతఁడు పఠించి నాచురల్ సైన్సు (జీవప్రకృతి శాస్త్రము)లో 'ట్రైపసు'స్థానమొంది ఎమ్. ఏ. బిరుదమందెను. ఇట్టి బిరుదము గొప్ప ప్రతిభావంతులకుఁగాని లభింపదు. జవహారులాలు జ్ఞానాభిలాషియై కాలమును దుర్వినియోగము చేయక, ఎల్లప్పుడు ఆంగ్లవాఙ్మయమునుగురించియు, రాజ్యాంగ తత్వములనుగూర్చియు, భారతీయ విషయములను గూర్చియు ఎన్నో ప్రమాణ గ్రంథములను చదివి వాని సారమును గ్రహించెను.

జవహారు బారిస్టరు పరీక్షకు చదువుటకై లండను లోని 'ఇన్నర్ టెంపులు' లో విద్యార్థిగఁ జేరెను. గాంధీగారివలె జవహారును శ్రద్ధాళువై శీలమును కాపాడుకొనుచు, జ్ఞానాభివృద్ధి చేసికొనుచు, పాశ్చాత్యుల సద్గుణములనే యవలంబించుచు, తన వ్యక్తిత్వము వృద్ధిచేసికొనుచు, అచటనుండిన

మన దేశపు విద్యార్థులగు డా. ఖాన్‌సాహేబు, డా. కిచ్లూ, సేనుగుప్త,సయ్యద్ మహమ్మదు, షెర్వానీమొదలగువారితో స్నేహముగ ప్రవర్తించెను. ఇంగ్లండులో సామ్యవాదపు వాఙ్మయమునుగూడ నతఁడుచదివి ఆ భావముల గ్రహించెను. ఇట్లు జాతీయభావములను, విషయ పరిజ్ఞానమును, లోకానుభవమును వృద్ధిజేసికొని బారిస్టరు పరీక్షనిచ్చి 1912 సంవత్సరములో స్వదేశము చేరెను.

## స్వదేశములో అతని న్యాయవాదిదశ

జవహర్‌లాల్ నెహ్రూ అలహాబాదు హైకోర్టులో వకీలై ప్రాక్టీసుచేయ నారంభించెను.

అతఁడు తండ్రికి సహాయుఁడై యెనిమిదేండ్లు లాయరుగఁ బనిచేసెను. హైకోర్టులోని కొన్ని కేసుల నతఁడు చాల ప్రజ్ఞతో నడపెను. ఇతఁడు మేధావి, కార్యపరుఁడు, సహృదయుఁడు.న్యాయవాది ప్రముఖుఁడై ద్రవ్యమును,ఖ్యాతిని నార్జించెను. కాని జవహరు కావృత్తియందు దీక్షలేదు. ద్రవ్యార్జనయం దాశలేదు. ఆతని హృదయమున బాల్యమందే జాతీయతాబీజ మేర్పడి, మొలకలిడి, దేశభక్తిగా వృద్ధియై అతని మనస్సును ప్రజాసేవవైపునకే త్రిప్పెను. ఇతనికి సంఘసేవ, దేశసేవ చేయవలెనని గాఢమగు కోరిక కల్గెను. తప్పనిసరి యైనంతవరకే వకీలుపని చేయుచు వీలైనంతవరకు జాతీయ కార్యముల కొరకే కృషిచేయు చుండెను. దక్షిణాఫ్రికాలోని భారతీయుల కక్కడి తెల్లవారిచేగల్గు దుస్థితిని తొలఁగింప, అక్కడి భారతీయులకు గాంధీగారు నాయకుఁడై

సత్యాగ్రహము నడిపించుచుండ, జవహర్‌లాలు ఈ దేశములో చాలచోట్ల ప్రబోధము కల్గించి, తన సంయుక్త రాష్ట్రము లలో నేబదివేల రూపాయల చందా వసూలుచేసి, దక్షిణాఫ్రికాకు పంపెను. అచట సత్యాగ్రహము విజయమొంది నందున ప్రభుత్వమువారు గాంధీగారితో రాజీకవచ్చిరి. 1914 సంవత్సరమున మొదటి ప్రపంచ మహా సంగ్రామ మారంభ మయ్యెను. 1916 వ సంవత్సరమున శ్రీ బిసెంటమ్మయు, శ్రీ తిలకుగారును హోం రూలు లీగులను మన దేశమున స్థాపించిరి.

జవహరులాలు వెంటనే యీ హోంరూలుసభ్యుడై చాల శ్రద్ధతో జాతీయ ప్రచారము చేసెను.

## వి వా హ ము

జవహరులాలుకు 1916 వ సంవత్సరమున వివాహ మైనది. పెండ్లికుమార్తె కమలాదేవి. ఈమె ఢిల్లీవాసియు, గొప్ప భూస్వామియు అగు జవహర్లాలు కౌలు అను కాశ్మీర బ్రాహ్మణుని ఏకైకపుత్రిక. కమలా నెహ్రూ రూపమందును, గుణములందును జవహరు కనురూపరాలై యుండెను. ఆమె విద్యావతి, ఉత్సాహశీల, దేశసేవాభిలాషియై భర్తకు తోడ్పడుచు జాతీయోద్యమమున తీవ్రముగ బనిచేసెను. 1917 సంవత్సరమున వారికి 'ఇందిర' అను కుమార్తెకల్గెను.

1939 వ సంవత్సరమున బ్రిటిష్ వారు జర్మనులపై (రెండవ ప్రపంచయుద్ధము) యుద్ధము ప్రకటించిరి. ఈయుద్ధము

ప్రారంభము కాకమునుపు జవహరు యూరపు వెళ్ళి అక్కడి పరిస్థితులు పరిశీలించి యూరపు పత్రికలలోను, నాయకులతోను చర్చించి స్వదేశమునకు మరలివచ్చెను. బ్రిటిష్ ప్రభుత్వము హిట్లరుతో పోరవలసివచ్చెను. యూరపువారి ట్లు స్వలాభమునకై సాగించు సామ్రాజ్యయుద్ధములకు భారతీయులు తోడ్పడరని జవహరు సూచనపైన కాంగ్రెసు తీర్మానించెను. జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెసు కార్యవర్గములో చేరి ప్రాధాన్యము వహించెను. సత్యాగ్రహము గాంధీ మహాత్ముని నాయకత్వము క్రింద జరుగవలెనని జవహరు సూచించగా అట్లే కాంగ్రెసు సమితి నిర్ణయించినది.

జవహరు స్వయముగ అట్టి సత్యాగ్రహము చేయబూనెను. గోరఖ్పురములో అతడిచ్చిన గొప్పయుపన్యాసము యుద్ధయత్నమునకు బాధకమని అతనిపై నేరము మోపి, ప్రభుత్వమువారు ఆయనను అరెస్టుచేసిరి. అంతట విచారణ జరిగి జవహరుకు 1940 సం. అక్టోబరు నెలలో 4 సంవత్సరముల కఠినశిక్ష విధింపబడెను. జవహరుకు ఇది యెనిమిదవ సారి జైలువాసపుశిక్ష. ఈ విధముగా జవహరు. భారత స్వాతంత్ర్యోద్యమ సమరములలో మహాయోధుడై కారాగార శిక్షల విరివిగ ననుభవించెను. జవహరు సోదరి విజయలక్ష్మియు సత్యాగ్రహియై జైలుశిక్షల ననుభవించెను.

భారత జాతీయ జనకుడు, విశ్వవంద్యుడగు గాంధీ మహాత్ముడు జవహర్లాలే (రాజకీయములలో) తన వారసు అని స్పష్టముగ పేర్కొన్నాడు. జవహరుతల్లి స్వరూపరాణియు చాల జాతీయాభిమాని. ఆమెయు జైలుయాత్ర

చేసెను. జవహరు భార్య కమలా నెహ్రూ ఆగర్భ శ్రీమంతురాలయ్యు స్వాతంత్ర్య యుద్ధములో సర్వస్వ మర్పించి జైళ్ళలో అష్టకష్టముల ననుభవించినది. ఆమె మహిళోద్యమములో అపార సేవ చేసినది.

## స్వతంత్రభారత ప్రధాని

1947 సం. ఆగస్టు 15 వ తేదీని భారతదేశ స్వాతంత్ర్య ప్రభుత్వము ఢిల్లీలో స్థాపింపఁబడెను.

జవహర్‌లాల్ నెహ్రూ స్వతంత్ర భారతదేశమునకు మొట్టమొదటి ప్రధానియయ్యెను. ఇతఁడు భారత దేశ ప్రధానియైనపిదప, మైసూరు, నైజాంరాజ్యము మొదలగు సంస్థానములకు సమైక్యత కల్గించెను.

జవహర్‌లాల్ నెహ్రూ దేశమున పరిశ్రమలను వృద్ధి చేయుటకై అమెరికాపరిశ్రమ తత్వవేత్తలతోను, అచటి పారిశ్రామిక వర్గములవారితోను పర్యాలోచనలు చేయుటకు అమెరికా ఖండమునగల వేంకూవరు, ఒట్టావా, న్యూయార్కు మొదలగు నగరములను సందర్శించి వారి అఖండసమ్మానముల నంది 1949 సంవత్సరము 14 వ తేదీ నవంబరు మాసమున విమానముపై బొంబాయి నగరముచేరి అచట బొంబాయి ప్రజలచేత తన అరువదియవ జన్మదిన వర్ధంతి నాఁడు బహుమాన, సమ్మానములఁ బడసెను. ఈయనకు పరమేశ్వరుఁడు దేశసేవచేయుటకితోధిక శక్త్యారోగ్యములనిచ్చి శతాయుస్సునిచ్చి మనుచుగాత!

# 6. సరోజినీదేవి

ఒకానొకప్పుడు ఇంగ్లీషుభాషను శ్రద్ధతో నేర్చుకొనుట లేదని బాలసరోజినీదేవి నామెతండ్రి ఒకదిన మొక గదిలో బంధించియుంచెను.

ఈ సంగతి నామె పెద్దదైనప్పుడు, ఇంగ్లీషు భాషలో పద్యముల రచింపనేర్చి ప్రసిద్ధ కవయిత్రియైనప్పుడు తన బాల్యజీవితమునుగూర్చి వ్రాయుచు, తానట్టి యింగ్లీషుభాష నేర్వ, తండ్రిచే నిర్బంధింపఁ బడుచు వచ్చినందుననే తాను కవయిత్రి నైతినని చక్కఁగ వికాసమొందిన పుష్పమువలె నాంగ్లభాషయందు వైదుష్యము సంపాదించినపుడు సగర్వముగఁ దెలుపుకొన్నది.

ఈమె తూర్పు బంగాళా దేశభాగమున ప్రసిద్ధ చటోర్జి వంశమునకు చెందినది. బాలసరోజినీ చటోపాధ్యాయ (బంగాళీ బ్రాహ్మణ వంశము) ఆంగ్లభాషలో ప్రసిద్ధకవయిత్రీ మణియై, తా నేభాష నేర్వ నిష్టపడలేదో అట్టి పరదేశ భాషయగు నింగ్లీషు భాషయందే కవయిత్రియగుచు విరాజిల్లెను. ఈమె తండ్రి అఘోరనాథ చటోపాధ్యాయ నిజాము వైద్యకళాశాలాప్రధానాచార్యుఁడు. ఆయన తన బిడ్డలకెల్ల ఇంగ్లీషుభాష నేర్పింపవలెనని పట్టుదల కల్గియుండెను. అతఁ డింగ్లీషు భాషలో గొప్ప వైదుష్యమును సంపాదించి 'డాక్టరు ఆఫ్‌సైన్సు' అను బిరుదును ఎడింబరో విశ్వవిద్యాలయములో (స్కాట్లండు దేశము) గడించెను. అప్పటికి సరోజినీ దేవి దక్కను హైదరాబాదులో 1879 సం. ఫిబ్రవరి 13–వ తేదీని జన్మించెను.

సరోజిని బాల్యమునుండియు అసామాన్యమైన బుద్ధి వైశద్యము గల్గియుండెను. ఇంగ్లీషుభాషలో పద్యరచనమును మాత్రము మిక్కిలి లేతవయసుననే ప్రారంభించెను.

ఆమె తండ్రి ఆమెను గణితశాస్త్రమునందేని, ప్రకృతి రసాయనాది శాస్త్రములందేని నిపుణురాలిగా చేయ నభిలషించెను. ఆమె వంశములో అనుక్రమముగా వచ్చు కవితాశక్తి విషయమునను, విదేశ భాషయగు నింగ్లీషులో కవిత నల్లెడు నేర్పును పొడసూపెను. ఆమె యాంగ్ల పద్య కవిత నాంగ్లేయులే మెచ్చుకొందురు.

చటోర్జీ వంశము సాహితీ సంస్కృతికి వాసిగాంచినది. సరోజినీదేవితల్లి బంగాళీ భాషలో మనోజ్ఞమైన పద్యముల రచింపగల్గియుండెను. తల్లినుండియే పద్యరచనాభినివేశము కల్గి ఆమెలో పొడమిన కవితాశక్తి యామె యాంగ్లేయ కవితలో వెల్లివిరియసాగెను.

ఈమె తండ్రియెడ నత్యంతమైన గౌరవభావముతో ప్రవర్తించెడిది. తన తండ్రివలె గొప్ప వైదుష్యము కలవారధిక సంఖ్యాకులీ ప్రపంచమున లేరని యామె భావించెడిది. తన తండ్రి యాంగ్లేయకవి 'హోమర్' వంటి వాడనియు, నతని కెప్పుడేని సంతోషముకల్గినేని విరగబడి నవ్వెడివాడనియు, తెల్లని గడ్డము గల్గియుండెననియు నామె వర్ణించెను. లెఖ్ఖలు చేయునపుడు జవాబు సరిగ రానిచో - పదునొకండు వత్సర

ముల వయస్సుగల యాబాలిక విసివి. వానిని దూరముగ పార వైచెడిది. కాని సహజ ధోరణిలో నింగ్లీషులో పద్యముల నవలీలగా వ్రాయగల్గెడిది. ఆమె పదమూఁడు వత్సరముల వయస్సున ఆరు వందల పద్యపాదముల నారుదినములలో వ్రాయఁగల్గెను. ఆ వయస్సుననే మద్రాసు విశ్వవిద్యాలయపు మెట్రిక్యులేషను పరీక్షలోఁ గృతార్థురాలై హిందూ దేశము లోని జనుల కెల్లరకును నత్యాశ్చర్యమును గలుగఁజేసెను. పదునాలుగు పదునారు వత్సరముల ప్రాయమ్మున రెండు వేల పద్యపాదములు గల నాటిక నొకదాని నింగ్లీషు భాషలో రచించెను. ఆనాటిక ముగించులోపల నామె శరీరారోగ్యస్థితి చెడిపోయెను. వైద్యు లామెకవిత్వ పరిశ్రమ మూలమున మనస్సునకు వేదన యధికమై యట్టి యనారోగ్యము కల్గె ననియు, నామె పాఠశాలకు పోరాదనియు, మానసిక పరిశ్రమ మాని విశ్రాంతిగై కొనవలయుననియు నాదేశించిరి.

ఆమె పదునైదవ యేట ఆమె మున్నే వరించిన డాక్టరు ముత్యాల గోవిందరాజులు నాయుడుగారి కిష్వఁబడి వివాహము గావింపఁబడెను. ఇది వర్ణాంతర వివాహము. ఈ వివాహమువలన నామె యాంధ్రుల యింటి కోడలైనది. ఆమె తల్లిదండ్రు లిట్టి సంఘ సంస్కార రూపకమ్మగు నీ వివాహము జరుగుట కంగీకరించుటచేతనే యీ వివాహము జరిగెను.

తల్లిదండ్రు లీమెను హైదరాబాదు నైజాముగారొసంగిన విద్యార్థివేతనముతో నింగ్లండులో జదువఁబంపిరి. ఈమె లండన్ నగరమున కింగ్సు కాలేజీలో జేరికొంతకాలమువిద్య గఱచెను. తరువాత కేంబ్రిడ్జిలో గల గిర్టన్ స్త్రీల కళాశాలలోఁ జేరి కొంతకాలము జదివెను. ఈమె లండన్ లో చదువుచున్నప్పుడే ఆమె నొకరు ఆంగ్లేయభాషలో ప్రసిద్ధ పండితుఁడు, కవి, విమర్శకుఁడు నగు సర్ ఎడ్వర్డుగోసే గృహమునకుఁ గొంపోయి ఆయనతో పరిచయము గల్గించిరి. ఆయన యీమె యాంగ్ల పద్యకావ్యములను చదివి, యీమెవయస్సు గల్గిన యితర పాశ్చాత్య దేశయువతి కంటెను ఈమె తనకుగల లోకజ్ఞానమునను, బహుళ గ్రంథ పఠనాలభ్యమగు జ్ఞానమునను తీసి పోదనియు,నీమె గొప్ప యాంగ్లకవయిత్రి కాగలదనియు నీమె కవనధోరణిని మెచ్చుకొనెను.అతఁడీమె వ్రాయు నాంగ్ల భాష నిర్దుష్టమైనదనియు, సరళమైనదనియు, నీమె వర్ణించిన దృశ్యములన్నియు నాంగ్ల దేశీయ సాంప్రదాయమైనవనియు నంగీకరించి, ఈమె యింత చిఱుత వయస్సునసే యాంగ్లేయుల తత్త్వము నెట్లవగతము చేసికొనెనో యని యాశ్చర్యపడెను. ఈమెలో నిజమైన కవితావేశము, కవితాశక్తి పూర్ణముగ నున్నవని యాయన పేర్కొనెను. ఆయన ఈమెస్వదేశములలోని దృశ్యములను, విషయములను గూర్చి వర్ణించుటలో తన కవితా చాతుర్యమును వినియోగింప నీమెను హెచ్చరించెను.అప్పటినుండియు నీమె తన కవిత్వమును భారత దేశీయ

దృశ్యములను గూర్చియు, రాజకీయాదివిషయముల గూర్చియు నాంగ్లేయ గద్యపద్యములలో నేర్పు మీఱ వ్రాసి మన దేశీయుల మెప్పును, ఆదరాభిమానములను చూరగొనఁ గల్గెను. ఈమె ఆంగ్ల భాషలో ననర్గళముగ నుపన్యసింపఁగలదు. గర్టన్ కాలేజీలో చదువుచున్నప్పు డీమె దేహారోగ్యము చెడినందున విశ్రాంతికిని, ఆరోగ్యము బడయుటకును నీమె యిటలీ దేశము వెళ్లవలసి వచ్చుచుండెను.

ఈమె యింగ్లండులో తన విద్యను ముగించి స్వదేశమునకు వచ్చి భర్తతో సంసారము చేసి బిడ్డలగాంచి వారితో నతి ముదమున కాలము గడపుచు, తానురచించిన పద్యములనువారిచే చదివించుచుండెడిది.

1914 సంవత్సరమున సంభవించిన ప్రథమ ప్రపంచ యుద్ధమును వర్ణించుచు, మన భారతీయ వీరులు ప్రపంచ శాంతికై చేసిన త్యాగమును వర్ణించుచు "ది గిఫ్టు ఆఫ్ ఇండియా" అను నాంగ్లేయ గేయకావ్యమును రచించెను. అందలి కడపటి పాదమున దేశభక్తిచే తన పుత్రులెందరు తమరక్తమును ధారపోసిరో జ్ఞప్తియందుంచుకొనుమని భారతమాత విదేశమాతతో దీనముగ నాక్రందనము చేయుచున్నట్లుకలదు. ఆపద్యములు చదువునపు డెట్టి కఠిన హృదయమునైనను కరఁగించి వేయును.

దక్షిణాఫ్రికాలో తెల్లవారు మన దేశీయులను మిక్కిలి బాధలు పెట్టుచుండినపుడు, ఆమె మన దేశమున

తెల్లవారినిగూర్చి వ్యతిరేకముగా ప్రచారముచేయుచు నుప న్యాసముల నిచ్చెను. కాన్పూరులో జరిగిన నలువదియవ కాంగ్రెసు మహాసభకు ఆమె యధ్యక్షురాలయ్యెను. గాంధీ మహాత్ముని ఉప్పు సత్యాగ్రహము మొదలగు నుద్యమము లలో పాల్గొని చిరకాలము జైలునివాస మొనర్చెను.

1947 సం॥న ఆగస్టు 15-వ తేదీన మన దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించినది. సరోజినీ దేవి సంయుక్త రాష్ట్రము లకు గవర్నరుగా నియమింపఁబడెను.

ఇట్లు సరోజినీ దేవి మన దేశపు రాజకీయ రంగమున తన జీవితపు కడపటి దశలో ప్రసిద్ధురాలై, కొలఁది మాస ములు సంయుక్త రాష్ట్రములకు పరిపాలకురాలై 1949 సం॥ మార్చి 2-వ తేదీన దివంగతురాలైనది. శ్రీమతి సరోజినీ దేవి భారత స్వాతంత్ర్య సంపాదన [illegible] దివ్యప్రభతో విరాజిల్లుచున్నది.

## ఆరోగ్యశాస్త్ర వాచకములు

సిలబసునకనుసరించి క్రొత్తగా వ్రాయబడినవి.

| | | |
|---|---|---|
| మొదటి తరగతి | ... | 0—4—0 |
| రెండవ తరగతి | ... | 0—5—0 |
| మూడవ తరగతి | ... | 0—6—0 |
| నాల్గవ తరగతి | ... | 0—7—0 |
| ఐదవ తరగతి | ... | 0—8—0 |

## స్వాతంత్ర్య భారత చరిత్ర.

నేటివరకు జరిగిన చరిత్ర వ్రాయబడినది.

| | |
|---|---|
| మూడవ తరగతి | 0—4—0 |
| నాల్గవ తరగతి | 0—6—0 |
| ఐదవ తరగతి | 0—8—0 |

## రాయల నీతి కథలు.

| | | |
|---|---|---|
| మొదటి భాగము | ... | 0—4—0 |
| రెండవ భాగము | ... | 0—5—0 |
| మూడవ భాగము | ... | 0—6—0 |

---

రాయలు అండ్ కో పబ్లిషర్స్, కడప.